# శ్రీ[illegible]మృతసారము

## కవితిలకగ్రంథమాల




గ్రంథకర్త్రి.

కవితిలక కవితావిశారద

చనపల్లి కనకాంబ

---

1936

కవితిలకగ్రంథమా

శ్రీతిరుమలశ్రీసహస్రలింగ

మహావిద్యాపీఠము

# అమృతసారము

కవితిలక కవితావిశారద విద్వాన్

కాంచనపల్లి కనకాంబాప్రణీతము

కవితిలక కుటీరము, చెన్నపురి.

మొదటికూర్పు : 1,000 ప్రతులు.

బెజవాడ.

వాణీముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

1936


మన్నారాయణచర
ణౌమమత్సారహితహృదయనళినవసంత
రామ! శరణంప్రపద్యే
భూమానందప్రదో విభూసుమహాంతా!

శ్రీ

లక్ష్మీహయగ్రీవాయనమః

# అమృతసారం

సకలకళా విచక్షణ, కాశీ కృష్ణాచార్యులవారి

## ఆశయము.

౧ ఈ గ్రంథకర్త్రి కాంచనపల్లి కనకమ్మగారు. ఈమె యాంధ్రగీర్వాణములందే గాక యాంగ్లభాషయందును జక్కని పాండిత్యమును గడించినది. భారతీయ కవులలోనిదియొకవి శేషము. కైతకునన్న. ఈమె బహుగ్రంథముల వ్రాసినది. వానిలో నీయమృతసారము తల మానిక మనివయోవృద్ధులగు న ద్వైతాభిమానులకు దప్పక తోచును. దానికిదార్కాణ మాగ్రంథ నామమే. అమృతసారమును మించిన వస్తువుండునా! నేనిదివఱకామె కోరకపై నామెయొక్క మఱికొన్ని యితర గ్రంథములకు నుపోద్ఘాతమును దగినంత విపులముగనే వ్రాసితిని. కవితా ప్రాశస్త్యమున్న పుడెందఱు ఎన్నిగ్రంథములకు ఎన్నివిధముల, ఎన్నిమారులు ఉపోద్ఘాతాదులు వ్రాసినను, జర్విత చర్వణ మనరాదు. ఈమె కవితను గూర్చి విపులముగ నిదివరకు పోద్ఘాతమున వ్రాసియుంటచే నీమెక సంగ్రహముగ న వ్రాయదలంచితిని.

౨ ఈ గ్రంథము "అమృతసారము" కవయిత్రి స్వప్రతిభాకల్పితము. అద్వైత తత్త్వ బోధకము, నిర్వచనమునయి అతి మనోహర పద్యములు 544 లు గలిగియే నొప్పియున్నది. ఇవిగాక గురుస్తవరూపమగు నొక మత్తేభమును, గురురూపభగవత్స్తవమగు నొక సంస్కృతమాలినీ శ్లోకమును, ఇది శ్రీయనుతుది గద్యమును గ్రంథాంతమునఁగలవు. ఈగద్యము వలన నీగ్రంథమే కాశ్వాసమని తెలియును. మహాకావ్యమని గ్రంథకర్త్రి గద్యమున వ్రాసినది. కవికర్మగాన గావ్యమగును, మహత్తరమైన వేదాంతతత్త్వ మిందులోని విషయము గాన మహాకావ్యమని గను. మహాకావ్యనామమీ గ్రంథమునకుఁ జెల్లునగు. పూర్వపుణ్య బ్రహ్మములచే భగవద్విషయకముగాని, యెట్టిమహాకావ్యము గూడఁ "కావ్యాలాపము గ" నెన్నఁబడెనుగదా.

శ్లో॥ "నయద్వచశ్చిత్రపదం హరేర్యశో
జగత్పవిత్రంయుది కర్హిచిద్వదేత్।
తద్వాయసంతీర్థము శన్తిమానసా
నయత్రహంసా న్యపతన్మి మంక్షయా॥"

(భాగవతము.)

ఈశ్లోకము ఈయమృత సారమునకు మహాకావ్యత్వమును స్థిరపఱచును. మంకళార్థగ శివపర్యాయేందుధరశబ్దమాదియందుంట చేతను, ప్రాయశః గ్రంథమునందెల్లెడలను, (మంగళా నాంచ మంగళుడగు) భగవంతుఁడు గోచరించుట చేతను, (మంగళా దీనిమంగళాన్తాని మంగళ మధ్యాని శాస్త్రా)

ణి (ప్రథంలే) ఇత్యాద్యను శాసన ప్రకారమీగ్రంథము నిశ్చల ప్రతిష్ఠమై పాఠకులకు మహాపురుషార్థ ప్రదమగుచునభివృద్ధి నొందుననుటకు సంశయ ముండదు.

గీతిశాస్వారస్యముగాని,కవితాస్వారస్యముగాని,పురుషు లకంటె, విదుషీమణులగు కాంచనాంగులయందే సహజముగ నుండునని యీయమృత సారము ననుభవించు వారికి గోచ రింపక పోదు. ఈగ్రంథమునందద్వైత రహస్యమతి సరళము గబోధపడుటచే, గురుకులవాసమొనర్చి ప్రస్థానత్రయ శాంక ర భాష్యాదులఁజదివిన వారికన్న నీగ్రంథము చదివినవారు త్వరలో వేదాంతులు కాఁగలరని చెప్పవచ్చును. ఈగ్రంథ మొక దానికి అనువాద రూపముగాక కేవలము గ్రంథకర్త్రి తనయాబాల్యానుభవముచే నార్జించిన పరమ రహస్యము లను, బోధలను, బొందుపఱిచి తేటతెల్లనగు మిశ్రాంధ్రమున సుభోధములగు కందగీతములలో, నక్షర జ్ఞానమాత్రముగల ప్రతివ్యక్తికినిఁ గొలఁదికాలముననే తత్త్వము కరతలామలకమ గునట్లొనర్చి యాంధ్రలోకమున కర్పించుటయే యింతమాహా త్మ్యమునకుఁగారణము.

మన భారతీయులలోఁబూర్వకవులను త్తరకవులను కరిం చుట యాచారము. కాని యీమెయటుగాక స్వప్రతి భాతవిల క్షణానేకదృష్టాంతములనే విషయమును జక్కఁగ ననుభవము నకురప్పించినది. 139, 452 మొదలగు పద్యములిందు ప్రమాణ ము. 407, 473 మొదలగు పద్యములఁ జూచినవారికి లోకో క్తులనెంత సులువుగఁబద్యముల నీకవయిత్రి యిమిడ్చిన దో తె

లియును. "ధాతాయథా పూర్వమకల్పయత్" అనుశ్రుతి
371 వ సీసపాదమునవనిమిడి కుందనమున నిమిడిన రత్నమును
స్ఫురింపఁజేయును. ఈగ్రంథములోని భక్తి, ఆర్తి ప్రబోధక
పద్యముల వినినచోఁ కఠిన హృదయములు ద్రవించును, నాస్తి
కులాస్తికు లగుదురు.

ఈమె తనగురువగు "అమృతానందస్వామి యొక్క
నామము సర్వదాజ్ఞప్తిలో నుంటకై యీగ్రంథమునకు"
అమృతసారము" అనునామకరణమొనర్చి నిజమగు తనగురు
భక్తిని, గ్రంథమునందంతటను, భగవన్మహిమమును వెలయిం
చి, దైవభక్తిని, విషయతుచ్ఛతను, బ్రకటించి ప్రపంచ విర
క్తిని, తత్త్వబోధనొనర్చి బ్రహ్మజ్ఞాన రూపముక్తిని సరసము
గ గోచరింపఁజేసినది.

448--497 పద్యములలో నీమెవర్ణించిన భాగవత
ధర్మములగు, నిస్సంగత్వ, సత్సంగత్వ, వివిక్త సేవిత్వ, భగవ
న్మైత్రి, మున్నగు విషయములు, తేటనీటిలోఁ జేపపిల్లలవలె
నాకు గోచరించుచుంటచే నేనాపద్యముల మఱవఁజాలననుట
యతిశయోక్తిగాదు. ఇట్టిపద్యములెన్నియో గలవు, విస్తరభీతి
విరమించితి.

అద్వైత పండితులైనచో నింత కంటె నెన్నియో మ
డుంగు లెక్కుడుగ నుపోద్ఘాతము వ్రాసియుందురేమో, కానినే
నట్టిఁడఁగాక పోవుటచే నింతకంటెనధికముగ వ్రాయఁజాలమికిఁ
పాఠకులు మన్నింతురు గాక.

ఇట్టి యుత్కృష్టమగు గ్రంథ ద్రోణిచే నెల్లరకు నమృ
త సారమును గ్రోలనిచ్చిన యీకవీశ్వరిని చిరాయురారోగ్యా
దులతో శ్రీసీతారామచంద్రమూర్తి మనుచుఁగాత.

ఈయమృతసారము పాఠకరసనాగ్రములంద నవరత
ము వెలయుచు, ప్రతిపాఠకుని బ్రహ్మానంద సముద్రమున నోల
లాడించుఁగాత.

శ్రీ

ఇ తి శ ం

కాశీ కృష్ణాచార్యః,
శ తా వ ధా నీ .



శ్రీమత్పరదేవతాయైనమః

# అమృతసారము

## శ్రీ కింకవీంద్రఘటాపంచానన
## చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి యాశయము

అనుభవప్రధానవిషయములతోఁ గూడియున్న యీపద్య కావ్యము, శ్రీకవితిలక కాంచనపల్లి కనకాంబగారిచే రచియింప బడినది. సుమారు పదునొకండు సంవత్సరములనాఁడు ప్రస్తుతకవయిత్రిచే రచియింపఁబడి, ప్రకృతగ్రంథపూర్వ పీఠిక యనఁదగు జీవయాత్రను సవిమర్శముగాఁ జదువుటయు, దానిపై విపులముగ నభిప్రాయమిచ్చుటయు నాపాత్రముగాదని విన ప్రాజ్ఞులకెల్లరకును స్పష్టమే. మఱియు నిన్న మొన్న నాటకముగ రచియించిన "హంసవిజయము" కూడా ప్రతిపాద్య విషయమున నీరెండు పొత్తములకు భిన్నమైనది కాదు. ఇవి శ్రవ్యములు అది దృశ్యము, అను భేదమొకంతయున్నను, ప్రధాన విషయమును బరిశీలించినచో నీమూఁడింటికిని గమ్యస్థానము పరతత్త్వమే "ప్రమాణానామనేకత్వేऽపి ప్రమేయస్యైకత్వాత్" అని మనపెద్దలు చెప్పుటచే నీమెపరిశ్రమము పూర్తిగా సార్థక్యము కలదనుటకు సందియము లేదు.

అటుకానిచో నీమెరచనకే కాదు ఉపనిషత్తులుండగా గీతలు గాని, భాగవతాది గ్రంథములలో నాయాఘట్టములయందలి తత్త్వ బోధప్రధానములగు శ్లోకములకుగూడ సార్థక్యమే యుండదు. ఆయా తత్త్వ బోధలకును బ్రస్తుత కవయిత్రి చేయు తత్త్వబోధ కును గొంచెము భేదము లేకపోలేదు. అది యెట్టిదనిన ఈమె గురుముఖము వలన నప్పుడప్పుడు వినిన సంగతులను నొక చో లిఖించుకొని యాసంగతులకుఁ దన యనుభవమును సహాయ పఱచి వీలైనంత సులభముగా జిజ్ఞాసువులకుఁ దెలివలెనని పూర్తిగా బ్రయత్నించినది. కాని విషయము సర్వసాధారణ మైనది కాకుండుటచేతఁ జాలచోట్ల వివరణమావశ్యకమని నాకు దోఁచుటచే నట్లొనర్పవలసి యుండుననిసలహా నిచ్చుచున్నాను.

ఈమెకు గవిత్వముఁ జిరకాలమునానే ధారాళమైనదిగా నేర్పడినను, సుమారిప్పటి కిరువది యైదేండ్లనుండి దానిలో వ్యాసంగముండుటచే మిక్కిలి చక్కని శైలిలో నడుచుచున్నను, విషయమగమ్య గోచరమైనదగుటచే వ్యాఖ్యానావశ్యకత కలిగినదిగాని లేనిచోఁ గవిత్వమెంత సులువుగా నన్వయింపవలెనో అంతసులుగా నన్వయించుచున్నప్పుడు వ్యాఖ్యానమెందులకని కొందఱనుకొనవచ్చును.

"దాసిసుతునిఁ దెచ్చి తగరూపుమాయించి
అది బ్రహ్మసుతుని నందుచేర్చి"

ఈపద్యము చక్కఁగా నన్వయించుచున్నను దాత్పర్యము తెలియుటలేదు కదా. ఇది వైద్యశాస్త్రములోనిది. ఈపద్యము

నకు క్రియా కారకాన్వయములు సులభముగ నున్నను, ఆకషా యములవనిని అనుభవములేని వైద్యుడు నిర్వహింపజాలడు అట్లే.

కం॥ ఉత్తమగతికిఁ దత్త్వం
బెత్తరిలేకున్న సత్యమే లేదుసుమా
యొత్తినమణి సదృశంబగు
మెత్తని బొగ్గుపొడి రత్నమే తలదాల్పన్!

ఈపద్యములో క్రియాకారకాన్వయములు సులభమైనను తాత్పర్యజ్ఞానమునకు సంప్రదాయజ్ఞాన మావశ్యకము కాకపోదు.

శ్లిష్టపదములున్నవను కారణముచే నేనిట్లు వ్రాయుట కాదు. తావన్మాత్రమే యైనయెడ, తత్పదార్థజ్ఞానమాత్రముచేఁ దాత్పర్యము శాంతాకాంక్షముగా నైతీరును ఇదియట్టిదికాదు ఇతరగ్రంధములయందుఁ జర్వితచర్వమైన దృష్టాంతములతోఁ గూడినదియు కాదు. కొంతస్వానుభవగురుప్రదర్శితానుభవములతో దీనికి సంబంధమున్నది. ఊరకనిమిత్తమాత్రమీ పద్యమునుదహరించితినేకాని యీపెరచించిన పద్యములలో బాహ్యికముగా నిట్టి భావమేమనమునకు స్ఫురించుచుండును.

ఈపె రచించిన పద్యములలో నెన్నోపద్యముల వదలి కొన్నిటిని మాత్రమే ప్రచురించినట్లు నేనభిప్రాయ పడితిని. అందులకామెకూడా యంగీకరించినది. ఈవిషయము నాకుగీరత రచనలో ననుభూతమై యుండుటచే దెలిసికోగలిగితిని.

మఱియుమహిమ శతకములోఁ గుట్టికవిశూడానా యూహానే బలపఱచుచు నొక వాక్యమును వ్రాసియున్నాడు.

శ్లో॥ "అర్థాశ్శబ్ద చయా స్సదాహమహ మిత్యగ్రే స్ఫురంత్య
న్వహమ్" స్వీకుర్యాంక మివత్యజామి కమివ శ్రీమల్లు లా
య్యప్రభో॥

ఒక్కొక్కరికి నొక్కొక్క విషయమున భావములు కుప్ప తిప్పలుగ స్ఫురించుచుండును. ఈమె పూర్వపుణ్యవిశేషము మంచిదిగనుక పరతత్త్వవిషయమున వివిధభావములను జాల పోలికలను స్ఫురించుట తటస్థించినది. ఇంతకన్న దరించుటకుఁ గావలసిన దేమి? సర్వవిధముల నీమె "స్వయంతీర్ణః పరాంస్తారయతి" యను వాక్యములకుఁ బ్రథమోదాహరణమై ప్రశంసార్హురాలుగా మనుగాక యని యాశీర్వదించుచు దీనిని సంక్షేపించుచున్నాను.

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి,

శతావధాని 2-8-36



శ్రీమతి కవితిలక, కవితావిశారద

కంచనపల్లి కనకాంబా ప్రణీత

# అమృతసారము



## సంపాదకీయ భూమిక

ఈ గ్రంథము శ్రీమతి కవితిలక, కవితావిశారద కంచనపల్లి కనకాంబగారు రచియించిరి.

ఈ గ్రంథమున కీనామమేల కలిగినది?

వీరిగురువుల దీక్షానామము "అమృతానందనాథుల" వారు. వారి పేరిట రెండు గ్రంథములీయమ వ్రాసి ప్రకటించినది.

"నామైకదేశాన్నామగ్రహణం" అన్నట్లుగా నమృతానందనాథులవారి బోధసారము నీమహాకవయిత్రి "అమృతసారమని, ఆనందసారమని" గురునామాంకితంబులుగా రెండు కావ్యములు రచించినది.

పక్షాంతరమున:—

అమృతమైనది అనగా జరామరణ రహితమైనది బ్రహ్మము. తత్ప్రతిపాదకమైన బోధసారమిందుండుటచేసి కావ్యమునకు "అమృతసార"మని పేరుకలిగిన దనవచ్చును.

లేక:—అమృతము; జరామరణ రహితులుగా నొనర్చునది. తత్సారమంతకంటె సత్త్వాకలది. బ్రహ్మజ్ఞాన మొసఁగి పాఠకులకు బ్రహ్మతాదాత్మ్యము కలిగించి, శాశ్వతులఁ జేయ సమర్థతకలదగుటచే నీగ్రంధ మమృతసారమను నామము ధరించినదనవచ్చును.

అథవా

ఇందలి కవిత్వ మమృతప్రాయమై సహృదయ హృదయాహ్లాద మొనర్చుటచే నీపాత్ర మమృతసార మనవచ్చును. అమృతసారమును గురించి కవయిత్రియిట్లు వ్రాసియున్నది.

చ॥ శ్రవణసుఖంబుగా నమృతసారమనన్ మనముల్
హరించుచున్
భవభయబాధ, బాపుచును మాధవపాదసరోజచింతనన్
దవులుచు నెల్లవారల ముదంబున నట్టిప్రబంధరాజముల్
జవులొదవంగ నేనమృతసారము వ్రాసితి నంబ త్వత్కృపన్
"అంబాస్తవము"

శ్రీమతి కనకాంబగారి కవిత్వము సకలలోకమునకు విదితపూర్వమే, ఆధునికమహాకవులెందఱో ఆమె గ్రంధముల, నామెతత్త్వజ్ఞానవిశేషమును మిక్కిలిగాఁగొనియాడియున్నారు. అమ్మహనీయుల యభిప్రాయములు శ్రీజీవయాత్రయందు, హంసవిజయమునందుఁ, బద్యముక్తావళియందు,నానందసారమునందును బ్రకటింపఁబడియున్నవి. కావున నిందుదహరింప లేదు. చూడఁగోరువారలందందుఁజిత్తగింతురుగాక!

ఈకవయిత్రి తనజీవితము నిట్లువర్ణించుకున్నది.

మ॥ భగవద్భాగవతాంఘ్రి సేవనమె మద్భాగ్యంబుగా
ప్రాసి పె
ట్టఁగఁ బంకేజభవుంఁడు లౌకికపు బాటల్ వీడి మోక్షంబుఁది
న్నఁగఁ జేర్పంగల సద్గురూత్తములను డెందంబందునన్ నిల్పిదీ
క్షగసత్కావ్యములన్ రచించెదను సాక్షాచ్ఛారదా సత్కృ
పన్.

కనకాంబాకృత "అంబా స్తవము."

ఈకవయిత్రికి భక్తిప్రపత్తులయందు మిక్కిలిఁ దాత్పర
ము. భాగవత కైంకర్యమున భగవత్కైంకర్య ఫలముకలుగు
నని యీమెసిద్ధాంతము.

కం॥ భాగవత బృందమందున
భోగించన్ రాముఁడెపుడు బుధు లాహరి స
ద్యోగంబున ధ్యానించెద
రీగుట్టరయంగ జాలవే తత్సేవల్ ॥

కం॥ భగవద్భక్తులకైక్యం
బగుటఁ బరస్పరము మెత్తురా? తను తనకై
తగఁ జేయుచుండు పనులకుఁ
దగునే? మెచ్చుకొన నాత్మధర్మముగాదే॥

పరమధర్మ మాత్మోపాసనమని యీయమ్మ నిర్ణయిం
చినది.

ఆ॥ వె॥ అఖిలధర్మములకు నాధారభూతంబు
బరమశాంతికరము భవహరంబు
నార్యసన్నుతంబు నాత్మాభిముఖుఁడౌట
యితర మెల్లజడుని బతితుఁ జేయు॥

మాయికులగు వేదాంతుల నీకవయిత్రి యిట్లుధిక్కరించినది.

కం॥ హృదయంబున హరినిల్పక
బెదరుచు లోకులకుఁ జాల బ్రీతిజనింపన్
వదరుచు నొక్కొకవసతినిఁ
గుదురుచు హరిసేవఁ జేయుకోసంబనుచున్

తత్త్వప్రాప్తికి స్వాత్మానుభూతియే ప్రమాణముగాని హేతుశాస్త్రచర్చాకౌశలము కానసుటకు నీసాధ్వి యిట్లు వ్రాయుచున్నది.

గీ॥ పరులబోధపరుపఁ బల్కుచుండును జ్ఞాని
హేతుశాస్త్రమాశ్రయించినట్లు
తానుస్వానుభూతిమానిమైయానంద
మనుభవించుచుండు నంతరాత్మ॥

శుష్కప్రియములు పల్కుట వేదాంతము కాదనియు భక్తిశ్రద్ధ లవసరమనియుఁ బల్కుట కుదాహరణము.

కం॥ దయయున్ సత్యముశౌచము
భయభక్తులుగలిగి మెలఁగవలయు గురులలోన్

నియతిఁ బ్రయత్నమున మనో
లయపర్యంతంబ దవ్వలఁ గై జంబా॥

భక్తిజ్ఞాన యోగముల సమ్మేళనము నీకవయిత్రి మిక్కిలి సరసముగా స్తుతించినది.

కం॥ దేహము దోఁచినపుడు దా
సోహమ్మని హరి భజించి శుభముల్ గను, సం
దేహము తోఁచిన యప్పుడు
సోహమ్మని చింతఁ బాపుచుఁ రమియించున్॥

మంత్రోపాసనయందును, యోగాభ్యాసమునందును, మాత్రమే కాక శ్రీశంకరభగవత్పాదప్రతిష్ఠితంబైన పంచాయతన పూజయందు నీయమకు మిక్కిలి తాత్పర్యము.

శ్లో॥ "క్వచిచ్ఛైవస్సార్థం క్వచిదపిచశాక్తైః స్సహావసన్
కదావిష్ణోర్భక్తైః క్వచిదపిచసౌరైః స్సహావసన్
కదాగాణాపత్యైః గతసకల భేదోద్వయతయా
మునిర్భవ్యో మోహంభజతి గురుదీక్షాక్షతతమాః" ॥

కవయిత్రిపద్యము

కం॥ ఆదిత్యు, నంబ, విష్ణుగ
ణాధిపతి మహేశ్వరీనినామ్నాయవిధిన్
మాదివ్యమందిరమ్మునఁ
దాదాత్మ్యంబొసగఁ గొల్చెదము గురుభక్తిన్॥

"స్థలాంతరమందును"

మ॥ పరమార్థంబని జీవకోటి కొసంగన్ • వాగ్దేవియై ప్రీతియై
హరియై శంకరుఁడై గణేశ్వరుఁడునై యాదిత్యుఁడై
యంబయై
పరుఁడై దేశికుఁడై పరాత్పరుఁడునై ప్రత్యేక
రూపంబులన్
ధరియింపంగల నీదుశక్తి దెలఁతున్ • ధర్మార్థకామంబులన్
బరివర్జించిన భక్తసాలికిఁగదా • ప్రాప్తించుదన్యోగమో
కరుణాసాగర రామచంద్ర నృపతీ కైవల్య దాతాకృతీ.

సమరసదృష్టి లేక శివకేశవాది భేదంబులఁ గల్పించుకొని స్వల్ప బుద్ధులకట లోకంబునం గలదు. ఏకదేవతారాధకుల, నన్యదేవతానిందకుల బోధకొరకై సర్వదేవతాత్మకుఁడు, పరమేశ్వరుఁడని శంకరులవా రుపదేశించి యుపలక్షణముగాఁబంచాయఁతనపూజ యద్వైతమున కవిరోధముగా నెలకొల్పిరి. దానికీపై నుదహరించినవారి శ్లోకమె ప్రమాణము.

"ఏకంసద్విప్రాబహుధావదంత్యగ్నింయమంమాతరిశ్వానమాహుః"

"ఆదిత్యునంబ" యనుకనకాంబగారి పద్యమునఁబంచాయతన ప్రశంసకలుగుటయే కాక

"మాదివ్య మందిరమ్మున, ఆమ్నాయవిధిన్, తాదాత్మ్యంబొసంగ గొలిచెదము." అనివ్రాయఁబడినది.

"మాదివ్యమందిరము" దివ్యమందిరమను పదముచే స్వగురుప్రతిష్ఠితంబైన, శ్రీతిరుమలశ్రీనివాస త్రిలింగ మహావిద్యా

క్షేకము సూచితము. మా యను బహువచనము ఔద్ధత్యసూచకము కాదు. "భక్తులు, భక్తురాండ్రు, తాను" ననుటకై "మా" యని ప్రయోగించినది.

జీవయాత్రయందు పరమహంసముఖమున కవయిత్రి యిట్లు పలికినది.

కం॥ ఓ పరమపురుష గురుకృప
నీ ప్రాపే కోరి మనము నిజ ధర్మంబుల్
గాపాడగ ప్రణవంబను
తెపన్ భవవార్థి దాటితిమి భక్తులతోన్॥

తమతో భక్తుల గలుపుకొనుట సాధువుల లక్షణము. తనతో వ్యవహరించు నేడు వాడలవారికిఁ గూడ నిచ్చినగాని తనకొక్కనికి మాత్రమేయైన మోక్షమక్కఱలేదని చిరుతొండనంబియను వైశ్య భక్తాగ్రేసరుఁడనియెను.

మహాప్రస్థానమందుఁ గళత్రసోదరాదుల వదలి శ్వానద్వితీయుఁడై యరిగినను స్వర్గమునకుం జని తనయనుజులను దనయొద్దకుఁ దెచ్చినఁగాని స్వర్గమును నేను గన్నెత్తియైనఁ జూడనని ధర్మరాజు పట్టుపట్టి తనవారికి తనస్థితి కలిగించెను.

"కొలిచెదము" అనుపదముచే ధర్మము సూచితంబగుచున్నది. కొలిచితిమి కొలుచుచున్నాము, కొలువఁగలము ఇది "మాశీలమని" కవయిత్రి చెప్పుచున్నది.

ఎన్నడో యొక్కనాడు కొలుచుటకాదే. ఈపూట శ్రీనాథకవి సార్వభౌముడు వర్ణించిన పదమును స్మరింపఁజేయుచున్నది. "ఈశ్వరార్చనకళాశీలుండ వభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధానమవు"

పీఠమందు భక్తులు తమప్రత్యేకాధికారముల కనుగుణముగ ప్రాణాయామ ముద్రాది సాధనములు వారు వారొనర్చుకొన్నను సర్వసాధారణ ధర్మము పంచాయతనపూజయని తెలుపుచున్నది. ఉత్తమాధికారులు జ్ఞానయుక్తులైనను నిర్గుణారాధనము సేయుచుండుట సంప్రదాయమేకదా!

"అరసి నిర్గుణ బ్రహ్మంబు నాశ్రయించి" చేయుచుందురు హరిగుణచింతనము"

భాగవతము.

"నబుద్ధిభేదంజనయేదజ్ఞానాంకర్మసంగినాం" అను న్యాయమును బట్టి శ్రీతిరుమల శ్రీనివాసత్రిలింగ మహావిద్యాపీఠమున బహిరంగముగ, పంచాయతన పూజయు, నామసంకీర్తనము మొదలగునవి జరుగుచున్నవి. చెప్పుటకంటె చేసి చూపుటమేలన్నట్లు" లేఖవయిత్రి "కొలిచెదము" అనితన గ్రంథమునందు వ్రాయుటయే కాక మహావిద్యాపీఠమునకుఁ దానేధర్మాధికారిణియై భగవద్భాగవతకైంకర్య మొనర్చుచున్నది.

అదికాక "అవిధినాకృత మకృతం" అను వచనము కలదు. కావున నాపూఁప "ఆమ్నాయవిధి నొనరింతుమని" వ్రాసినది. ఏమి ప్రయోజనముకో? "నధ్యాతం పదమీశ్వరస్య విధివత్సంసారవిచ్ఛిత్తయే" అనిభర్తృహరివాక్యాను సారము సంసారవిచ్ఛిత్తికొఱకు విధివత్తుగా నీశ్వరధ్యానము చేయనగు ను గానఁదాదాత్మ్యసిద్ధికై కొలిచెదమని వ్రాసినది. స్థాలీపులాకన్యాయమున నీయమృతసారమునందలి ధర్మములజాడను జూపియున్నాము. ఇది ప్రతిపద్యరసోదయము గానున్నది గావున నితిదిక్కుగా మేము జూపినరీతి ననుసరించి పాఠకులీ గ్రంథమునడుగడుగున నానందించి కృతార్థులు కాఁగలరనియునట్టి భక్తాగ్రేసరులపై గురుపరంపరయొక్క యాశీర్వాదము సదా వెలయునని మాత్రము వచించి విరమించుచున్నాము.

ఇట్లు
అధిపతి
తిరుమల శ్రీనివాస త్రిలింగ
మహావిద్యా పీఠము.

# పద్యానుక్రమణిక



శ్రీ భాస్యాయ నమః

# అమృతసారము.

గీ. ఇందుశేఖరుని విందిందిరాహృదయపద్మ
పద్మబంధు బృందారక ప్రాణపదము
నంద గోగోప గోపికానందనంబు
యోగి హృదరవిం దేందిరాగ్రిమంబు
దాసచాతక నీలాంబుదంబుఁ గొలిచి
డెందమానందమునఁ దేల నందుకొంటఁ
గలము కలముతో నార యక్షరము కరము
వాణి యాంధ్రి గీర్వాణసద్వాణి నలువ
రాణి రాణ నంతర్వాణి వాణిఁ గొల్వ
నిచ్చెఁ బరిపూర్ణభావంబు నిచ్చె మెచ్చె
శాంతి శ్రీభాస్యులకు మ్రొక్కినంతఁ గాంతి
మమ్ము సకలాత్ములను జేసి మహిమ పెంచి
యిన్ని విధములఁ బ్రోచిన నీశు గురుని
మదిని నిల్పుట మాకు సుమంగళములు
సచ్చిదానందరూప! విశ్వప్రదీప!
సాధు జనకల్పభూజ! విస్తార తేజ!

ఉ. గోవులు జీవు లౌటఁ దమ
కుందగు గోపకుఁ డీశ్వరుండు వి
శ్వావరణమ్మున న్నిలిపి
యర్థములం దగఁ బ్రోచి తత్సుధర్మ
ద్రావును భక్తవత్సలత
రాజిలు కావ్యముఖాబ్జమందు నాన్
గేవలకీర్తి మాకగును
గేవల కీర్తి మహాత్ములార పై
తావధి ధర్మమానుగద
యాత్మల కైక్యము జీవయాత్ర సం
భావితమర్మ మిద్దిగను
భక్తులమిమ్ము నుతింతు నెంతయున్॥

శా. సర్వారంభము లుజ్జగించిశుచివై
శాంతాత్ముఁడై, యోగివై
నిర్వాణ ప్రభుఁడై, మహామహిముఁడై,
నిర్ద్వంద్వ సంచారివై
శర్వారాధన తత్పరత్వ నిధివై,
శశ్వద్భవోత్తీర్ణుఁడై
యుర్విన్ ధీరుఁడు పూర్ణుఁడై సులభుఁడై
యొప్పున్ సదాచారుఁడై॥

మ. పరమార్థైక పరాయణత్వమున 'స
ర్వం ఖల్విదం బ్రహ్మ' యన్
గురుమంత్రంబు జపించుచున్ గుశలతన్
గోవిందు నర్చించుచున్

ననుసరన్ సౌఖ్యముదుఃఖమున్ గలుగ స
వ్వానిన్ దివారాత్రు ల
ట్లరయంగలేదు నాత్మతత్త్వవిదులన్
బ్రార్థింతు స్రశాంతమున్॥ 4

ఉ. లేని ప్రపంచమున్ గనఁగ
లేమిఁక లేముల కాటపట్టు కా
మానల దహ్యమానగహ
నాంతరసీమ మహేంద్రజాలమా
యానగరీసమంబు, తెలి
యంగలవా రెవ రిద్దిదాఁట శ్రీ
జాని! భవాబ్ధిపోత! మము
సాఁకుము నీపదపంకజద్వయిన్॥ 5

ఉ. ముక్కునఁ ద్రాడు గట్టి మము
ముంచుచుఁ దేల్చుచు నున్నయట్లు వే
షక్కుల సంచరింతు వని
పల్మరు, బెద్దలు వేయినోళ్ళతో
నొక్కి వచించినన్ వినక
నోటికి వచ్చినయట్లు ప్రేలుచోఁ
జిక్కునె శాంతి జీవులకుఁ
జిక్కునుగాక మనోవికాసమున్॥ 6

మాలిని. వలచివలచి సిద్ధుల్ వాంఛఫలం ద్రుంచు లీలన్
గొలిచికొలచి మూర్ఖున్ గొల్వఁ జాలించు జీవుం
దలసియలసి బాలుం డట్టి నిద్రించులీలన్
దలఁచితలఁచి దేవున్ దాను దాదాత్మ్య మొందున్॥ 7

కం. కృతదీక్షాతత్పరులై
మితిమీఱక దేశికాజ్ఞ మృత్యుంజయులై
స్మృతిఁ దప్పియుండియుఁ స
ద్గతికిన్ హాఁగొల్చు రామదాసులఁ దలఁతుఁ॥ 8.

గీ. చింత లన్నింటి మాని విశ్రాంతిఁ బూని
జానకీజాని పదజలజమకరంద
మాని, కర్మయోగంబందు మానినైన
వానియానంద మెవ్వాని కౌను జగతి. 9.

గీ పట్టుదల చూవె కోర్కెలపుట్టినిల్లు
కోర్కెలేకాదె జీవులఁ గూర్చు జార్పుఁ
బట్టుదల వీడుటే జీవబంధముక్తి
జీవుఁ డన్నికోర్కెలు వీడ దేవుఁడంద్రు 10

కం. అనుకొనుట యన్నఁ దోఁచుట
యనిరఁ జీవత్వసంజ్ఞ లగుట మును మునుల్
మునిఁగిరి జ్ఞానానుభవం
బున ధ్యానంబునను రామమూర్తులు తామై॥ 11

కం. హితమునకుఁ బ్రియము నిడుచు సు
కృతి, దుర్మతి యప్రియఁబుఁ బ్రియమునకై తా
నతిధీరుఁ బోలి విడు నీ
గతి సాంకర్యంబు పుట్టగన పైపూఁతఁ॥ 12

కం.భాగవత బృందమందున
భోగించుఁ రాముఁడెపుడు బాధు లాహారి స
ద్యోగంబున ధ్యానించెద
రీగుట్టర యుంగఁ జాలవే తత్సేవల్॥ 13.

గీ. లేనిజీవతఁ గల్పింపఁబూనుకొనుట
యున్నకైవల్యవిషయమై యూహలేమి
సత్త్వత త్త్వశూన్యత్వముల్ చక్కఁ దెలుపు
సహజధర్మంబుఁ బాలింప సకలసిద్ధి॥ 14

కం. ద్వేషము రాగము లేక య
శేషాకృతులందుఁ దగిన చేష్టల నొగి ని
ర్దోషుండై చేయుచు సం
తోషంబున సూత్రధారుతో నొక్కండౌ॥ 15

కం. భగవద్భక్తుల కైక్యం
బగుటఁ బరస్పరము మెత్తురా! తిను తనకై
తగఁ జేయుచుండు పనులకుఁ
దగునే మెచ్చుకొన నాత్మధర్మము గాదే. 16

కం. అంతయు రామమయం బని
యెంతున? విభ్రాంతి రాము నిటునటు వెదకఁ
గాంతున? యేకాంతంబునఁ
జింతఁ విడనాడి యెదభజింతుఁ రాముఁ॥ 17

ఆ. వె. కామరహితమైన కర్మంబు ధర్మంబు
కారణంబు లేని కరుణఁ బడయఁ
దల్లిచంటిపాలు తద్దయుఁ బడయంగఁ
దనయుఁడై జనించు ధర్మ మట్లు॥ 18

ఆ. వె. అఖిలధర్మములకు నాధారభూతంబుఁ
బరమశాంతికరము భవహరంబు
నార్యసన్నుతంబు నాత్మాభిముఖుఁ డౌట
యితర మెల్ల జడునిఁ బతితుఁ జేయు॥ 19

కం. హితపథమునఁ దా నడువక
హిత మితరులు కూఁడి చెప్పినల దుర్మతి, తా
మితిమీఱి, వారి తనయెడ
హితవృత్తిఁ బొలఁగ రంచు నెగరి పడుఁగదా॥ 20

కం. ఆలోచన తత్త్వముఁగనఁ
గా, లోలత్వంబు; శాంతి కైవల్య మగుఁ
లీలా కేళీలోలుఁ
బాలుఁగా నెంచి పెంచు బాలయె జాలిఁ॥ 21

గీ. తెలిసి జపియింతు జపియింతుఁ దెలియకుండ
జపము చేయక చిత్రంబు జప మొకర్తు
మాఱుపని లేదు మంత్రంబు మఱపురాదు
వాచ్యవాచకముల నేత ప్రణవమూర్తి॥ 22

గీ. ఏటిదరిని నున్న నెక్కడో యున్నను
ద్రాగునీరు హెచ్చు తగ్గు లేదు
కాని యేటిదరినిఁ గాపురం బుండిన
శాంతి, దూరమైన భ్రాంతి, నిజము॥ 23

కం. ఓజలసన్నిధి నక్షర
రాజిని నెట్టెట్లో దిద్ద వ్రాతయుఁ దేలుఁ
ఓజలసన్నిధి నక్షర
రాజిని నెట్టెట్లొ దిద్ద రాముఁడు తేలుఁ॥ 24

గీ. తపము మొదలు సర్వధర్మంబు లరయంగ
భక్తిలేమి వెదకు ప్రతినిధులగు
నెన్నిచేసియైన నేకాంతభక్తియే
లేకయున్నఁ గొదువ కాకయున్నె॥ 25

గీ. బాహ్యభక్తి సలుపు, భావంబునను నిల్పుఁ
దరుణ మనుసరించి తత్త్వవిదుఁడు
మందబుద్ధి దురభిమానియు నెట్టొట్లొ
యొందుసల్పు, వేఱొకందు నిల్పు॥

కం. హృదయంబున హరి నిల్పక
బెదరుచు లోకులకుఁ జాల భీతి జనింపన్
బెదరుచు నొక్కొక వసతిని
గుదురుచు, హరిసేవఁ జేయుకోసం బనుచున్॥

కం. గురుబోధామృతజలనిధి
సరసులు గాంచెదరు భూరిశశ్వత్ ప్రభలన్
బురుషోత్తమ రత్నముఁ దమ
శిరముల ధరియింప ముక్తిసిరి వరియింపన్॥ 28

కం. సంపూర్ణబోధ వడసినఁ
గంపింపఁడు ధీరుఁ డాత్మకల్యాణమునన్
సంపద లాపద లెఱుఁగక
పెంపొందున్ దత్పదార విందంబందున్॥ 29

కం. తనతండ్రికి దాఁ జేసిన
ఘనకార్యమె కొడుకు తనకుఁ గావించుఁగదా
తనలోనిహరిని సేవిం
పనితన్నున్ గొల్వ నెవఁడు పాల్పడు చెపుమా॥ 30

గీ. పరులబోధపఱుపఁ బల్కుచుండును జ్ఞాని
హేతుశాస్త్ర మాశ్రయించినట్లు
తానుస్వానుభూతి మానినై యానంద
మనుభవింపుచుండు నంతరాత్మ॥ 31

కం. తినిపించిన వినిపించినఁ
గనిపెంచినవారు చేయుకరణిఁ బాలుం
డనుమానింపఁడు విహరిం
చును మేల్కొను నిద్రఁ గాంచుఁ జుమి నిశ్చింతన్॥ 32

కం. ఏకాంతభక్తుఁడెంచఁడు
లోకము దచ్చిత్రలీలలో హరినెంచున్
లోకులఁ గని హరిలీలల
నాకులపడ కాశపడక స్వాత్మ రమించున్. 33

కం. యోచన వియోగసూచన
యోచన భయభేదసంజ్ఞ యుత్కంఠయు నా
యోచనప్రక్కలఁ జూచుట
మోచన మది లేక యునికి బుధనుత మునికిన్॥

కం. ప్రారబ్ధార్థము విడువఁగ
ధీరుఁడు తగియుండు దానిఁ బేర్మి వహింపన్
ధీరులు యత్నింత్రు పరము
ధీరుఁడు నెఱవేర్చు, రామదేవుం డొకఁడే॥ 35

కం. ప్రారబ్ధం బెట్టిటులో
నేరక జీవుండు పట్టి నెట్టఁదలంచున్
ధీరులు గలరే యిల నా
దారిఁ దప్పించుకొనఁగఁదగు నుపరతియే॥ 36

గీ. కాలిక్రింద నుండుఁ గాకున్న నొకమూల
నుండు, దోషబుద్ధి నుండు ఖలుఁడు
శివుని శిరమునందు శేషాహి భూషయౌ
విషము లేనిభోగి విందుగాదె॥ 37

కం. ఆమాటల నాబంధుల
నామర్యాదలను విడిచి యానందంబున్
గామించుట యాదిగ శ్రీ
రామేతర మెందుఁ దెలియరాదు సుకృతికిన్॥ 38

గీ. స్వాత్మ రామార్పణము చేయు నాత్మవిదుఁడు
సకల సుగుణాభిరాముఁడు శాంతికరుఁడు
పరమధర్మస్వరూపుఁడు పావనుండు
తన్మయత్వంబు వాని సంతర్పణంబు॥ 39

కం. తనకై తా యోజించును
దనకొఱ కన్యులను వేఁడు ధైర్యమువీడున్
బనిఁబూని పరులవిషయము
లను నెంచున్ మలినజీవ లాంఛనవృత్తిన్॥ 40

గీ. ఊరకానందవార్ధిని నోలలాడు
నరుఁడు నారాయణునిభక్తవరుఁడుగురుఁడు
పరుఁడు పరమాత్ముఁడతని కెవ్వాఁడు పురుడు
తన్మయత్వంబు వాని సంతర్పణంబు॥ 41

గీ. శాంతి హరిపాదపద్మ విశ్రాంతిసుమ్ము
శాంతి భాగవతాత్మీయ కాంతిసుమ్ము
శాంతి జన్మాదిదుర్వ్యాధి శాంతిసుమ్ము
శాంతి నిర్లిప్తుఁడైన వేదాంతిసుమ్ము॥ 42

కం. ఆరోహణ మవరోహణ
మేరీతిఁ రాగసరణి కేకాకృతియౌ
నారీతిఁ ద్రిమతభక్తులు
తా రాకృతిఁ దాల్చుచుందు రీ తథ్యముబహుధా॥ 43

కం. హరినామస్మరణకు నం
తరాయ మొక యింతగల్గినఁ బ్రతుకేదీ
నరులకునది హేతువుగా
'స్మరణాన్ముక్తి యని' స్మృతులు చాటుంగాదే॥ 44

కం. నామస్మరణము స్మరణము
ధీమంతుల కొక్కటయ్యు, దీనులకకటా
ప్రామాదిక భేదంబది
సామాన్యముగా జనించు స్మరణసకలమా॥ 45

గీ. దుష్టకర్మంబు క్రిందికిఁ ద్రోయుచుండ
భక్తి నెగఁబ్రాఁకుచుండి తాఁ బట్టుపట్టి
నరుఁడు కడతేఱు నీశ్వరుకరుణ నెట్లొ
ధరణిఁ గీల్కొంబ మెక్కుడు కరణిఁగాదె॥ 46

గీ. తెలియఁదగినట్టి తత్వంబుఁ దెలియుపిదపఁ
దెలివితోఁ బనిలేకుంటఁ దెలివితప్పి
నట్టివానికి జ్ఞానికి నరయభేద
మొక్కయింతేని లేకుండు నిక్కమముగఁ
జాల నున్మత్తురీతిని, బాలులీలఁ
దిరుగుచుండునుగాన సందేహమేది
తత్త్వవేత్తలు జ్ఞానితత్వంబుఁగాంచి
మెచ్చుకొనెదరు కనెదరు హెచ్చుశాంతి॥ 47

కం. నీకొఱకా? నాకొఱకా?
లోకైకగురుం డదెట్టులో యీజీవా
నీకము నాడించును న
స్తోకానందంబు గలుగు చొప్పునఁదనకున్॥ 48

గీ. మొదల ప్రియము నవలహితంబు రుచియింప
సక్రమంబైనపథ మద్దియగుట బుధులు
హితము విడిపించి ప్రియముల నెవఁడు కోరు
వాని భ్రష్టునిగా నెంచి బహిరొనర్తు॥ 49

క అనుబంధ చతుష్టయమున
కనుకూలము లేనియట్టి యాచారంబున్
గనుకొని లౌల్యం బనియెద
రనుకూలంబైన, ధర్మమని యెద రార్యుల్॥ 50

గీ. నాచు నీటివలెనె నానావిధంబుల
నీచుఁ జేయు జీవు నిజము మాయ
బూచి చీని జూచి బుధు లేని తత్వంబుఁ
దాచుచనంచు రామదాసులైరి॥ 51

గీ. పంచదార చిలుక, బ్రహ్మంబు జగమంచు
నెంచుబుధున కేటివంచనంబు
సంచితాదులు నశియించును మూఁడును
విషయములను బట్టు విడుపు విడుచు॥

కం. కాన నుదాసీనుండై
కాననో, యింటినో, గృహస్థగతినో యతిగా
నో, నిలిచి బాలుపగిదినో
మౌనంబుననో, సుఖించు మాటాడుచునో॥ 53

కం. బాలుండై సత్క్రీడా
లోలుండై యాత్మ నాత్మలోఁ గాంచి, కృపా
శీలుండై నిజధర్మము
లీలం గురుభక్తిఁ జేయు లే ముక్తుండై॥ 54

కం. లే దీజగమని, విష్ణుఁడు
కాదే సర్వం బటంచుఁ గాంచిన పిదపన్
భేదవ్యక్తుల కుచితం
బాదారిని నడిచి భ్రాంతి నఁ దఁడు బుధుఁడున్॥ 55

కం. ఆటల భేదక్రమ మది
పాటించినమాత్ర నింత భ్రాంతి మనమునన్
నాటునె, భేదం బెగురన్
మీటునె, లోకానుభూతి మిథ్యాత్వమునన్॥ 56

ఆ.వె. తనువు మఱచి తిరుగు త్రాగుఁబోతునకును
దెలివి గలిగి మెలఁగు దీనునకును
గలుగుభేద మరయఁగల వెట్లొ నిత్యంబు
ముక్తవరునకు భవరక్తునకటు॥ 57

గీ. ఉన్నదున్నట్లు లుండుట యుత్తమంబు
దానినే యుదాసీనులు ధర్మమంద్రు
భక్తిరూపిద్ది గురుమూర్తి భాగ్యమిద్ది
సర్వశాస్త్రార్థ మిద్ది ప్రశస్తమిద్ది॥ 58

గీ. చేయుచుంట కాదు, చేయకుండుట కాదు
తత్త్వబుద్ధి నాత్మఁ దగిలి చింత
లేకయుంట, వేఱుగాకయుండుట యాత్మ
కంటె ముక్తి శక్తి యూప్తసూక్తి॥

కం. ప్రతిబింబదర్శనము స
ద్గతికిన్ బాధకము, దానిఁ దప్పింపఁగ సం
తతరామధ్యానామృత
మతులితసాధనము, భక్తుఁడట్లాగిఁ జేయున్॥ 60

కం జ్ఞానాధికరణ మాత్మగ
దా నిజముగ దృశ్యలయముదనుకన్ దృక్కోఁ
దానే, సంశయరహితుం
డౌ నాత్మా రాముఁడాత్మయగా వేయేలా॥ 61

కం ఈమాదిరి ధ్యానంబున
నేమంత్రంబైన సిద్ధినిట్టికనియెడున్
ఈమహిమాఁత పదంబది
యేమయినన్ భారమెత్తఁడేబలమున్నన్॥ 62

కం. కావలసిన యర్థంబది
కేవలమాత్మస్థమైనఁ గ్లేశపడుచుఁదా
భూవలయమందు నెవఁడే
నీవలనావలను వెదుకునే విభ్రాంతిన్॥ 63.

కం. గిన్నియని యనుచు ననుకొను
చున్నదిరజతంబు క్రియలనున్నది రూపం
బన్నను వెండికివేఱై
యున్నదో యున్నది యనుకొనుచున్నది హారియే॥ 64

కం. దయయున్ సత్యము శౌచము
భయభక్తులు గలిగి మెూఁగవలయు గురులలో
నియతిన్ యత్నమున మనో
లయపర్యంతంబ దవ్వాలన్ నైజంబౌ॥ 65.

కం. ఉన్నదియున్నటు లగపడు
నెన్నఁగ నెవ్వానియందు నిలవాతనికే
యున్నదియున్నటు లగపడు
నన్యఁ మఱియొండు మార్గమారయఁ గలదే॥ 66.

గీ. ఇంటిమీఁదరాళ్ళ వెన్నైనఁ బడనిమ్ము
సుప్తుఁడైన సరుఁడు సుఖమునుండు
మేలుకొన్న యప్పుడాలించు నల్లాడు
బారుగువారిఁ బిలుచు బొబ్బలిడుచు॥ 67

కం. సందేహము తామానిన
సందేహంబడియు మానుసంశయమేలా
డెందము శ్రీహరి సేవక
బృందంబుఁ గూడి భక్తిఁ గ్రీడయొనర్పన్॥ 68

గీ. ఈఁదుచున్నఁగాద దెగవేసినను గాదు
జగమునఁ బనికత్తె సత్యముగనుఁ
జేసిచేయనట్లు వాసిగాఁ గాన్పించు
రమణిరమణి ప్రథమరసఖవిమణి॥ 69

గీ. పాడుచుండునోట భగవానుపైఁబాటఁ
గంటఁజేయుచుండు నెల్లపనులఁ
గ్రీడగాదెయిద్ది శ్రీరామ నీనామ
సార మెపుడుఁ గ్రోలు సరణిగాదె॥ 70

గీ. తన్నుఁబోలెఁబరులఁ దన్ని యూడించుఁ బ్ర
ధానమంచుఁ దెలియు ధన్యుఁడెవ్వఁ
డెట్టులేమిసేయ నెంచు నెంచునొరుల
నంచితాత్మమయతఁ గాంచుఁగాక॥ 71

గీ. నోరుపడిన వెనుక నారాయణధ్యాన
మమరు, సకలసిద్ధులమరు నవల
రామ రామ రామ రమణీయగుణధామ
ప్రణవమంత్ర జపము పరమ తపము॥ 72

సీ. ఆత్మవేత్తలిల ఫలాపేక్ష లేకుండఁ
గర్మములను జేయఁగలరసంగఁ
బౌరుషమ్మనమ్మ పరదైవమును నమ్మ
మనుటగాదె శాంతిమనుటగాదె॥ 73

కం. కూర్చినవానిని బ్రీతిని
జేర్చుట రానట్టిదానిఁ జేరకకాలం
బోర్చుటకామం బార్చుట
అర్చించుట దైవమూర్తి హరియించుటయుణ్॥ 74

కం. తచ్ఛోదిత సంకల్పము
లెచ్చుటనేనంచునమ్మి హితమతి మెలఁగన్
బిచ్చి తలంపులు పుట్టవు
సచ్చరితుండెందు సిద్ధసంకల్పుఁడగున్॥ 75

కం. జగమున బ్రహ్మము కనఁబడుఁ
దగఁ బౌరుషమట్లుదోఁచు దైవంబదిగా
విగతాఘుఁడు వెట్టింబలె
నగపడుఁబూర్ణుండు రిక్తునట్లల్లాడున్॥ 76

కం. హరిమయము విశ్వమను వాఁ
డరిమయముగ నెట్టలెంచు నానందముతోఁ
జరియించుఁ దగినరీతిని
బొరయించుకలేక సర్వమున్ గ్రహియించుణ్॥ 77

కం. ఎన్నఁడు నిత్యధ్యానము
పన్నగమాకబ్బు రామభద్రుఁడు సర్వం
బన్ననుడిస్వానుభూతిన్
దిన్నఁగఁగన నేర్తు మస్మదీయగురుకృపణ్॥ 78

గీ. బుద్ధులన్ని మాకుఁ బుట్టించు చిచ్ఛక్తి
యనెడు మంత్రమెఱిఁగి యలరు భక్తు
లెప్పుడెట్లుదోఁచు నప్పుడా రీతినిఁ
జేయుచుంద్రు చింతసేయ రెందు. 79

కం. నేనెవ్వరు శాసింపఁగ
నానారూపాత్మకుండు నారాయణుఁడే
లోనుండి బుద్ధులన్నిటిఁ
దానై ప్రేరేపభ్రమ వృధా నాకేలా? 80

కం. దీనునివలె ధీరునివలె
జ్ఞానంబుదయించుదనుకఁ గలుషాత్మంబై
వీనిన్ వానిని నెంచును
మానవుఁడాత్మీయవిద్య మఱగి సుఖించున్. 81

గీ. సారెకొక్కరీతి సామాగ్రి కల్గునా!
పాకభేదమున ననేకరుచులు
శ్రోత్రవిషయమున్నె? శ్రుతిచోదితముగాక
గురునికృపనుబలుకుకొలది రసము॥ 82

గీ. ఆర్చితీర్చికోర్కు లాత్మనుదోఁడ్తోడఁ
బ్రణవమూరి నాత్మరమణఁ జేర్చి
యాత్మమయతనొప్పునతఁడు జీవన్ముక్తుఁ
డందురంద్రుసహజమైనయవల॥ 83

గీ. అనుభవమునకైనయవియెల్ల దోఁడ్తోడఁ
దీర్పవట్టితలఁపు లార్పసర్వ
మాత్మమయమనంగ వ్యాజమెఱుకయత్న
మేదసహజభక్తిగాదెలీల॥ 84

కం. దశరథ సూనుపదంబుల
వశతన్ భజియింపగల్గు వైరాగ్యము మా
దృశులకు శ్రీగురుకరుణా
వశమున జనియించె నెంత భాగ్యముకలిలోన్॥ 85

కం. ఓంకార స్మరణంబు న
హంకార త్యాగమును సదానందపదముల్
శంకర తత్త్వముఁగని లో
శంకల విడనాడు సాధుసజ్జన తతికిన్॥ 86

కం. గురుమూర్తి చర్యలద్భుత
గురుకరుణన్ బోధచేసె గురుతరభక్తిన్
బరమార్థ యోగశక్తికి
శరణాగత రక్షణంబు సహజలక్షణమా॥ 87

ఆ. వె. దండితనము వైరిదర్పంబు తెలుపును
గొండమెత్తులోయ కొలఁది తెలుపు
శాంతికలిమిఁదెలుపు సంగరాహిత్యంబు
మంత్రమహిమఁ దెలుపు మౌనముద్ర॥ 88

గీ. సకల సకలాళి శ్రీపాద సరసిజముల
మఱగి తత్సార మహిమ మైమఱచియఱచు
విధము లేమొకొ సిద్ధాంత నిధులఁజేర్చు
పథము లవ్వాని వర్ణింతుఁ బరునుతింతు॥ 89

గీ. శాంతియందుభ్రాంతి భ్రాంతియందున శాంతి
భక్తిలేమి నిన్నిపాట్లు పడుట
ఇది యహంకృతికృతికృతి యీశ్వరార్పితం
బాత్మఁజేసి మించునైక్యసిద్ధి॥ 90

కం. శ్రీహరి భజనము మదిసం
దేహము లేకున్ననాఁడు దేహముమఱవన్
సాహసముఁ గల్గునాఁడును
మోహము విడనాడునాఁడు మొదలు గురుకృపన్॥ 91
కం. కృతినేననియు, జగంబా
కృతిఁగనవలెననియు, నొరులకన్నన్, నేనే
మతిమంతుఁడ ననియుం, జెడు
మతిహీనుఁడు, సుకృతి శాంతిమను నైక్యమునన్॥ 92
గీ. తన్నుఁదాఁదెలియుట తత్త్వంబుఁదెలియుట
పరుల దెలియుటాత్మ శరణుఁజొచ్చు
టంద్రు బుధులు దాని నానందమంద్రు శ్రీ
హరి యనుగ్రహమున నమరునదియు॥ 93
ఆ. వె. పరులదోషమరయుఁ బాపాత్ముఁ డిలలోనఁ
బుణ్యుఁడు తన పాపములగణించు
దోషమెంచకుండు దోషవిదుండొర
వానిఁబోలువాఁడు వసుధఁగలఁడె॥ 94
కం. కలదంతయుఁ బరికింపఁగ
నలయోంకృతి వాచ్యవాచకాది వచనముల్
లలిఁదానై భాసిల్లుచుఁ
గలకాలము సాధుపాళి కళ్యాణమగున్॥ 95
కం. వైరాగ్యమెలుబ్ధత్వము?
దారాపుత్రాదులందు దయభూతదయో
దారతలె? నియమరహిత వి
హారము ముక్తియును స్వేచ్ఛయౌనె? హరిహరీ॥ 96

కం. గురుపుత్రులు నిస్పృహు లా
హరి భక్తులు రాజయోగు లనుభవపరులై
ధరనొండు తగుల మొల్లరు
విరతియు బ్రహ్మాను భూతి వీరికి విందా॥ 97

కం. భోజన శయనాదులయం
దే జాడన్ జూడఁగ్రమ మొకింతయు మఱవం
డీ జీవుఁడు భవతారక
మోజన్ భజియింప డేలొకో శ్రీరాముఁ॥ 98

కం. వికృతిగఁ బ్రకృతిగ సుకృతిగ
నకలంకుండైన యాత్ముఁడాడుకొనంగా
వికలాత్ములు వగచెదరట
యకటా ముప్పోకలందు నలరున్ గృతియే॥ 99

కం స్థితిగతుల కైక్యమెఱుఁగని
మతిహీనుఁడు చచ్చుబ్రతుకు మాటలచే దా
మెతుకుల కై పతితుండౌ
సతతానందము గురుప్రసాదం బిలలోఁ॥ 100

కం. మోహము దేహముతో సరి
దేహము మానసముతోనది సరి, మనసుసం
దేహముతో సరి, జ్ఞానము
తోహరి!హరియించుదాని దోషము గురుఁడై॥ 101

కం. మదముడిగిననాఁడే సుమి
ముద మొదవున్ సర్వబంధములు హరియించున్
సదయుండౌ శ్రీరాముం
డదిగోరి గురుస్వరూపుఁడై యుదయించున్॥ 102

కం.లోకముఁజూడకయాత్మా
లోకనమునఁ బొల్చు భక్తలోకం బదయే
నాకంబచటనే దేవా
నీకము వసియించుమేము నివసింతుమటఁ॥ 103

కం. భ్రమమున భేదాభిప్రా
యములం గలవారిఁజేర్చి యమబాధలకుఁ
సమములగు బాధలందుట
క్రమమా శమమాదమంబ కైవల్యంబా॥ 104

గీ. ఎన్ని సున్నలైన నేలెక్కకునురావు
కొన్ని యంకెలున్నఁ గొదువసుమ్ము
అంకె లాశ్రయించి యాదియందుంచిన
నొకటి కొకటి పూర్తి నూతనిచ్చు॥ 105

కం. పాపంబులు పుణ్యంబులు
నేపగిది హరించు నెంతయేడ్చినయేనిన్
శ్రీపతికీడగసర్వం
బేపురుషుండెఱుఁగు వాని కేసుమిశుభమా॥ 106

ఉ. ఆసరసీరుహాక్షునకనంతునకాత్మ సమర్పణంబుఁ దాఁ
జేసితరించు ద్వంద్వములు జీవుఁడు, జీవతవేహరించు వి
శ్వాసము లేక రిక్తుఁడయి వాసనలందగఁ బెంచునట్లుగాఁ
జేసిన బాపపుణ్యములు చిత్తమునొత్తక రిత్తపోవునే 107

కం. క్రమమునకుఁ బ్రాలుమాలుట
మమతాహంకార రహితమాహాత్మ్యంబే!
సమరసభావముకల్గిన
సమయము సమయంబు పరమశాంతికిగానఁ॥

కం. సంకల్ప జనకుఁడజుఁడఁట
సంకటపడనేల కలది జరుగును నీపై
వంకల దిద్దుట వలపగు
శంకరుఁడవు సాక్షివైన సర్వవిధములన్॥ 109

కం. బందువువలె బహురీతుల
నందఱఁబోషింతు నాత్మఁ డహమనువాఁడే
యిందొకరి కొకరుచేయుట
కుందగు నాయాత్మవంచకులు జీవులకున్॥ 110

కం. తనశక్తి నొరులశక్తిని
మనమున నెఱనమ్మధర్మమాద్రోహంబౌఁ
దనశక్తి కొరులశక్తికి
ననఘ పరాశక్తి మూలమన ద్రోహదమౌ॥ 111

గీ. హంసనాశ్రయించి యన్నివిధంబుల
బ్రతుకవలయు భక్తిఁబ్రాభవమునఁ
బారమార్థికంబు వ్యావహారిక మొక్క
రీతి నాదిశక్తిరీతిఁ దెలుపు॥ 112

కం. మోహమునఁ దన్ను నితరుల
సాహసమున నమ్మికొన్న సద్గతిగలదా
ద్రోహులుగాఁ దేలిరిగద
యైహిక మాముష్మికంబు హంస తెలుపదే। 113

కం. ఒడలెఱుఁగని యొడయండే
కడచున్ ద్వంద్వార్థసమితిఁ గామాదులలో
నడఁచున్ మృత్యుంజయుఁడై
నడుచున్ గురుసూక్తరీతి నవ్యప్రీతిన్॥ 114

కం. బాలుండన బ్రహ్మాండన
లీలన్ బరిపూర్ణుండైన లీలన్ లలిఁదా
నాలించుచుఁ జాలించుచు
మేలాకృతిఁ దాల్చినట్లు మెలఁగి చెలంగున్॥ 115

కం. శూన్యస్థానము హిమగిరి
కన్యాధవు గేహమంచుఁ గాంచిన భక్తుం
డన్యంబు గాంచనెంచున
ధన్యుండాత్మాభిముఖతఁ దా రమియించున్॥ 116

కం. అన్యులకుఁ దనకునొకగతి
ధన్యతఁగల్పించు ధర్మతత్వంబాకఁడే
శూన్యస్థానం బందున
మాన్యుండై యునికియన్న, మాటలికేలా॥ 117

కం. తరుణమున లక్ష్యపెట్టక
మరణంబున నేడ్చుచున్న మాధవుఁడేమిా!
కరుణించు ననుచునమ్మిన
శరణార్థియె, మదము సాహసము తలకెక్కన్॥ 118

కం. ఎడతేగని భక్తికుదిరినఁ
బుడమిని. ధన్యుండు ధర్మమూర్తియతండే
తడవా? దైవము దార్ఢ్యము
తడవా? సంసారవార్ధి దాఁటఁగఁ దడవా॥ 119

గీ. ఇంద్రియంబులెల్ల నేకార్థయోగంబుఁ
గోరుచున్నవఖిల సారమంచు
శ్రీగురూక్తరీతి శ్రీరామనామంబు
నియతభక్తి, దానవనిత్యముక్తి॥ 120

కం. నాస్తికులకిలఁ బ్రశస్తము
స్వస్తియొ, యప్రస్తుత ప్రశంసకళినిటుల్
దుస్తరమగుఁ బ్రారబ్ధము
నిస్తులగతిఁ గట్టికుడుప నిలుప నెవనికొ. 121

ఆ. వె. జగము మఱచువాఁడు భగవంతుఁడా! భక్తుఁ
డా! యనాథుఁడా? యథార్థమెద్ది?
పాలఁగలసివెంట బైటవచ్చెడునీరు
పాలో! నీరొ? తెలియఁబలుకవశమె॥ 122

కం. జ్ఞానంబున మౌనంబున
ధ్యానంబున నీశ్వరేచ్ఛ నల గురుకృపచే
మేనెఱుఁగక యేకాంతము
గా నిల్చినఁ దపము పొల్పుగను నిశ్చింతన్॥ 123

కం. మోహంబు మనోబుద్ధుల
రాహువు వలెఁబట్టువిడదురా! దేహము సం
దేహము దాసోహమ్మని
సోహమ్మని వేహరింప కమనస్కమునన్॥ 124

కం. దేహముదోఁచినపుడు దా
సోహమ్మని హరిభజించి శుభముల్గను సం
దేహము తోఁచినయప్పుడు
సోహమ్మని చింతబాపుచున్ రమియించున్॥ 125

కం. సిద్ధులిటు సుప్రసిద్ధము
శుద్ధము శ్రేయస్కరంబు సుపథముఁజూపన్
బుద్ధికినచ్చని మ్రుచ్చున
కిద్దరమతిరొక్కడుండునే బోధింపన్॥

కం. ఎప్పటికే నప్పథమునఁ
దప్పక గుఱియుంచినమువఁ దాదాత్మ్యమునన్
గప్పురముఁబోలిజీవత
చప్పఁగహరియింపమించు సాయుజ్యమొగిన్॥ 127

కం. మనవలె విధి వశులొరులని,
మనవలె, శాంతిని, నసూయమాధవుఁగనలే
మనవలె, నాత్మార్పణమున
మనవలె, నిశ్చేచ్ఛముక్తిమహిమన్ భక్తిన్॥ 128

గీ. బ్రతుకఁదలఁచి ఫణికిస్వాగతంబెవఁడిచ్చు
భవుఁడు తక్కఁ జెడుగు బడుగు తక్క
ముక్తిఁగోరి రామమూర్తి గొల్వఁడెవండు
కూళ యాత్మవంచకుండు దక్క॥

గీ. పెక్కువిషయంబులను వీడి యొక్కఁడైన
రాముఁ బరమార్థముగఁగొల్చి రాముఁడైన
యవలఁదనను జీవన్ముక్తుఁడనజరించు
భక్తునకు బ్రహ్మమయము నిర్భయముజగము॥ 130

కం. అన్నిటికిందగియున్నది
పెన్నిధివలె భక్తతతికిఁ బ్రియమొనఁగూర్చున్
మున్నందఱు ఋషులన్నది
కన్నది విన్నది గురూక్తి కదయున్నదియున్॥ 131

గీ. ముక్తినిత్యానిత్యత్వ ముఖసమస్త
సంశయభయములు తమంత సమసిపోవు
నాత్మగానిల్చుఁ బొల్చు దృశ్యములఁగాల్చు

స్మరణమాత్రాన నెట్టి నేర్పరియెయైనే
నదియు నాత్మార్పణంబుగ నమరెనేమొ॥

గీ. విష్ణునందునాత్మ విడువనేరకయెట్లు
పట్టుదలలువీడఁ బట్టువడును?
పట్టువిడనివాఁడు భక్తుఁడెట్లా భక్తి
హీనుసేవ బుద్ధిహీనుఁడగును॥ 133

గీ. బుద్ధిహీనజనుల బుధులుగానెంచుట
వారివలనఁ బనినిఁ గోరుచుంట
వారికీకస్వేచ్ఛ వారిఁబీడించుట
నస్తువరయకుంట వాంఛనుంట॥ 134

గీ. నామరూపవితతి నానాత్వసంగతిఁ
దనువు మఱచియుంట తప్పులగుట
నిత్యమాత్మశక్తి నెఱనమ్మి బ్రహ్మాత్మ
బుద్ధిబూర్ణభావమున రమించు॥ 135

గీ. భక్తులైన వెంటఁ బడెదరు తనతోడ
ముక్తికర్తలగుదురుక్తరీతి
నీతితప్పకుండ నిజగురుధ్యానంబు
చేసి, రామభక్తులైసుఖంత్రు॥ 136

గీ. ఏలయేలయంచు నిదికాదు కాదంచు
దృశ్యమెల్ల వేపరిత్యజించి
ఆత్మమాత్రుఁడైన యానందమూర్తిని
దలఁతుఁ గొలుతు నతనివలెనె నిలుతు॥ 137

కం. నడచుచుఁదూలిన యప్పుడుఁ
గడువై శమతాను నిల్వఁగాఁ గదలుట నె
వ్వఁడు నేర్పును దనుతత్త్వము
జడుఁడెవ్వఁడు? యత్నమిట్లు సలుపసహజహా॥ 138

గీ. తాటిచెట్టు కాల్వఁదాఁటుటకై వేయ
దానిమీద నడచు తరుణమందు
స్వాస్థ్యము నిలబెట్టు సహజంబుగాఁగాక
దానినెట్లుచెప్పఁ బూనునొరుఁడు॥ 139

గీ. చిత్రగతులనాఁడు జేతులాడించును
వెఱ్ఱిచూపుఁజూచు వెతలఁబడును
అరసి యరయకెట్లొ యాత్మస్థితినినిల్పు
కొనును బుధునిసహజ గుణము తపము॥ 140

కం. తనుదా నిలువంబడఁగాఁ
దనపట్టు న్నిలువఁబెట్టు ధర నెవ్వండేన్
దనపట్టునకుం దనకును
గనశివశక్తులకుఁబోలెఁగ నభేదంబుల్॥ 141

గీ. పట్టునిల్వకున్నఁ బడిపోవుఁగావునఁ
బట్టునిల్పుకొనుట బ్రతుకు తెరువు
పట్టుదేవుఁడౌను బైదోఁచుజీవుండు
తెలిపి తెలుసుకొనుచు నిలుతురులలి॥ 142

గీ. చెప్పకుండదు పట్టుఁతాఁజెప్పినట్లు
వినకయుండదు దేహంబు వెఱ్ఱికైన
రెండునొకఁడౌట కర్తవ్యముండు రెంట
నొక్కఁడై నిల్చు రెండుగా నుండనేమి?॥ 143

గీ. రెంటిమైక్యంబు భేదానఁ గంటఁబడును
విరహమునను శృంగారమ్ము సరణిఁ బరణి
జన్మమందున హరిభక్తి చందమునను
సగుణమున నిర్గుణంబట్లు సత్యమిదియ॥ 144

గీ. చూడకున్నయేని చూచినయేనియు
నిలువఁబెట్టుకొనుట నిజము రెంట
ననఁగ రెంటదానియందైక్యమును గల్గి?
మెలఁగుచుంటయాత్మ నిలుచుచుంట॥ 145

గీ తనపరోపకృతియుఁ దనతారకంబును
బట్టు వదిలెనేని బ్రతుకలేమిఁ
బరమపురుషునాద్యుఁబట్టి పాశికాడును
బట్టునిలుపు దేహ మట్టుసుమ్ము॥

గీ. శమదమాదులెన్న శాస్త్రార్థమెన్నఁగా
భక్తిసేతలెన్న ముక్తియున్నఁ
దనకుగొప్పగాదు తదితరులకుఁగాదు
పరిబ్రతుకు తెరువు వారివలన॥ 147

గీ. తననుఁబోలియుండుఁ దనభృత్యవర్గము
నైజబింబముగుట నీజగంబు
వారిచింతమాని వైరాగ్యమునుఁబూని
ఆత్మమయతనున్న నమరునన్ని॥ 148

గీ. జరిగెనేని చాలసౌకర్యమున్నది
జరుపదలఁచెనేని చావునిజము
ఈ రహస్యమరసి ధీరులు విహరింతు
రాత్మమయత మనకు నటులెస్వస్తి॥ 149

కం. ఆశాభయములచేత న
నీసుండగువానిచేష్ట లివిరెండిలలో
దోసములు కర్మఫలముల
నాశించుట, పెంచుచుంట నభిమానంబున్॥

గీ. సాధుహృదయంబె యీశ్వరసదనమగుట
సిద్ధసంకల్పమందుఁ బ్రసిద్ధికెక్కు
వానిచర్యలు తర్కింప వరమె తరమె
ఓన్నమశ్శివాయ విరతియుత్తమంబు॥

గీ. గురునిమూర్తి ముందు గుఱుతుగా నిడుకొని
పరమభక్తి నతని పగిదినిలిచి
సామరస్య మఖిల శాస్త్రార్థసారంబు
ముక్తిఁగాంచు నతిశయోక్తిగాదు॥

గీ. మౌనముద్ర సర్వమంత్రార్థసారంబు
జ్ఞానముద్ర సకల కర్మవిరతి
యోగనిద్ర రాజయోగానుభూతి సం
దేహ మూహచనవి దేహముక్తి॥

గీ. భక్తివిశ్వాస ధర్మప్రపత్తులున్న
పురుషులెందుఁ గూడుదురది పరమపదము
అట్లు సత్సంగమబ్బని యవసరమున
సర్వవిధముల ముక్తినిస్సంగవృత్తి॥

గీ. తెలియనందాక నితరులఁ దీర్పరాదు
ఎఱుఁగనప్పుడు పరులను నెన్నరాదు
తెలియునవ్వలఁ దానెట్లు దిద్దుకొనెనో
యట్లె యితరుల కనిసాక్షియౌను సుకృతి॥

గీ. కాన నిరతంబుఁ దనుఁదానఁ గాంచుచుండి
భక్తియోగంబు శ్రీగురుసూక్తియుగుల
నిత్యమంతర్ముఖుండవై నిరతిశయసు
ఖంబనుభవించు మాత్మతేజంబు గాంచు. 156

కం. నిరతామృత హరినామ
స్మరణరసాయనము సువ్వెజన్మామయ సం
హరణం, బాలయు, మెవ్వం
డురుభక్తిని సేవఁ జేయునో వానికగున్॥ 157

కం. చేతయు యోచనమాటయు
నూఁతయగున్ వ్యావహారికోచితవృత్తిన్
బూఁతయది యీశ్వరేచ్ఛకు
నీతియవిూనంబు బ్రహ్మ నిష్ఠునకరయున్॥ 158

గీ. చిత్తవృత్తినిరోధించి శివముబెంచి
దృక్కుగానిల్చునందాక దృశ్యవితతి
విలయమొనరించు ధీరుండువిష్ణుభక్తి
సాధనముఁగాఁగ శ్రీగురుబోధమహిమ॥ 159

కం. చేసినదిలేదు మున్నిఁక
దోసములంజేయఁబోము తోఁపకయెద్దేన్
దాసులుచేసినవీసము
దోసములేదందురాత్మతుల్యులుగానన్॥ 160

కం. అక్కఱపట్టనివానికిఁ
జిక్కనె శ్రీ వెంకటేశ సేవ హరి హరీ!
ఎక్కడఁజూచిన పెంటల
మెక్కెడు కుక్కలకుధర్మమే ! మోక్షంబే!

గీ. పరుల నెన్నరాదు పాపియేత్తాననైన
బుద్ధియున్నఁదనను దిద్దుకొనును
బండితుం డరయఁడు పరులదోషంబులు
మూడుకాకతిరుగు మొండిపురుగు॥ 162

కం. నేనా హరియందుండుట
ధ్యానము తద్విభునియందుఁ బద్దయునిల్పన్
బూనుట సహజంబేకద
జ్ఞానుల హరిభక్తికొందు కారణమేలా॥

గీ. శాంతిమూర్తిభవించిన చందమమర
నాత్మతుల్యులు భక్తులత్యంతబలులు
వారిదర్శనలాభమవ్వారిగాఁగ
సకలశుభములనిచ్చు యశంబుదెచ్చు॥ 164

గీ. భక్తులెచ్చోట వాసనఁబాసి గురువు
లనుభజింపుచును మనోవిలయముగాంత్రు
పూర్ణబోధసుధావృష్టి పొర్లుచుండు
నన్నితీర్థంబు లచటనే యున్నవంద్రు॥ 165

ఉ. నీవునిమిత్తమాత్రముగ నిల్వుము సర్వము సిద్ధమంచునా
నావిధవాసనల్ తొలఁగ నవ్యతరోక్తులఁ గృష్ణుఁడర్జునున్
గావఁగ సర్వమున్ దెలిపెఁగాదె వివేక మొకింతగల్గినా
జీవులకిద్దిచాలదొకొ శ్రేయముగూర్పఁగ శ్రీశుఁజేర్పఁగన్ 166

కం. కింకర్తవ్యతనరయుట
శంకరతత్త్వంబు నమ్మజాలమిసుమ్మా
కింకరవృత్తికి భక్తికి
సంకటమేలేదు బ్రహ్మసాయుజ్యమొగిన్॥

కం. కావున నెదియెటుకానీ
కేవలఁ దత్త్వంబు దానికిఁ భ్రమయేలా
జీవుఁడు చెప్పఁగ మాటలు
లేవానందంబునందులే తన్మయతన్॥ 168

గీ. భక్తినాత్మాభిముఖుఁడైన పండితుండు
తనువు మఱచినవాఁడెపో ధర్మమూర్తి
భక్తిహీనుండొ బాహ్య ప్రపంచమందుఁ
దగిలి వర్తింపవాఁడె యధర్మమూర్తి॥ 169

కం. ఆశాభయ సంతోష
క్లేశ ప్రీత్యార్తి జనక కేవలమిథ్యా
వేశ ముదాసీనులకొక
లేశము లేకుండువారలే కృతకృత్యుల్॥ 170

కం. అద్దమువలె శుద్ధంబై
పెద్దల హృదయంబు పొల్చుఁబెరవారలకై
సుద్దులు చెప్పఁగఁ బూనదు
దిద్దుకొనున్ దానిసన్నిధిన్ భక్తుండే॥ 171

కం. యోగము వియోగి కోరును
యోగియు భోగించుచుండు నూరక బుధుఁడా
యోగవియోగము లరయక
సాఁగించున్ జీవయాత్ర సమరసభంగిన్॥ 172

కం. హరిసర్వంబనియైనన్
నరులందఱుఁ దన్నుఁబోలి నష్టాత్మలటం
చరసిననైన నదేలా
కరమొరులన్ జూచి నరుఁడు కటకట పడునో॥ 173

గీ. శత్రుమధ్యమందు శౌరిని ధ్యానించి
మిత్రులు హరిచేయు మిత్రులగుట
సహజభక్తి మెలఁగు సరసాళిసేవించి
నిత్యముక్తుఁడగును నిజమునరుఁడు॥ 174

గీ. మౌనముద్రదాల్చి మహనీయుఁడై పెల్చుఁ
గోర్కులన్నిత్రుంచి గురుభజించు
హరినిలోనఁగొల్చి యానందముననిల్చు
బాలకుండు పరమ పండితుండు॥ 75

కం. ఎపుడెపుడాయని వెదకుచు
నెపమొక్కఁడు దొరుకఖలుఁడు నిజధర్మంబున్
గపటాకృతి విడనాడును
విపరీతపథంబుఁబట్టి వేడుకపుట్టన్॥ 176

కం. ఎటులో నిలుచుచుఁ దలఁచుచు
నెటులో చేయుచును జేయకెద్దియునేమో
నటనముఁజేయుచుఁ బలుకుచుఁ
బటమున్ గపటంబువిడిచి బ్రహ్మజ్ఞుండో॥ 177

కం. భక్తుండో గురుసేవల
యుక్తుండో మంత్రపటిమ నూరకయుంటన్
ముక్తుండో సమరసమున
శక్తుండో నాత్మనాగ సాధువలరుచున్॥ 178

కం. సర్వము సిద్ధంబనువాఁ
డుర్విన్ బ్రాకృతినిఁ బోలియుండునులోనన్
గుర్వీశ నిగమభక్తిన్
బూర్వాపరచింతలేమిఁ బూర్ణాత్మసుమీ॥ 179

కం. గురువులు చెప్పిన చొప్పున
నిరతాభ్యాసంబు చేయు నేర్పరియైనన్
గరుణింపరాదు కడతేరుదు
శరణార్థిని నన్ను మాత్రసంతసిలుదురే॥ 180

ఆ. వె. కాంచువంత మేరఁ గాలునాగించిన
గాంచుచుండుననలఁ గ్రోవయదియు
ఉన్నచోటనుండియూహించుచుండినఁ
గోరుదాని నెవఁడు చేరఁగలఁడు॥ 181

ఆ. వె. తన్మయత్వగరిమఁ దాదాత్మ్య బుద్ధిని
నెట్టులేమి సేయు నెవఁడైనను
మానియైనఁ జేసియైన శుద్ధుండగు
ముక్తుఁడగును బరమభక్తుఁడగును॥ 182

కం. భ్రమమున వేదాంతానుగ
శ్రమమున నొనరించు కర్మసంచయ మెల్లన్
దమమున్ బెంచును బెంచును
గ్రమముగ సంసారవార్ధిఁ గడవెళ్ళించున్॥ 183

కం. నేనొనరించెడు కృత్యము
లేనరులొనరింతు రట్టులేయొనరింత్ర
ద్దానిఁ బరాపరవశతన్
మానవుఁడరయంగ ధర్మమార్గ మలవడున్॥ 184

కం. మతిపరమాత్మంజేరఁగ
స్మృతి తప్పిన వానిఁబోలి కృతకృత్యుండౌ
నతిధీరుఁడు శ్రేయస్కరుఁ
డతులితగతిఁ జెలఁగు శక్యమా వర్ణింపన్॥ 185

కం. సమరసమే భక్తియగుఁ
జుమి శక్తియు భుక్తిము క్తిశుభకర మదియే
క్రమమెఱుంగమి శాస్త్రాభ్యా
సమునకు మఱలు న్నరుండు సాధువుగామిన్॥ 186

కం. సర్వావస్థల నోంకృతిఁ
బూర్వాపరచింతమాని పురుషుఁడుభక్తిన్
నిర్విఘ్నముగ నొనర్పఁగ
సర్వాగమసార మాత్మ సాయుజ్యమగున్॥ 187

కం. తానీఁదంగలవాఁడై మ
హానది దాటించునొరుల నావిధముననే
తానుఁగృతార్థుఁడు కాఁవలెఁ
దా నితరులఁ గృతులఁజేయఁదలఁచిన యేనిన్॥ 188

కం. ముత్తియములలో దారం
బెత్తెఱఁగుననుండు జితవృత్తులలో నా
యుత్తమమగు ప్రణవము నా
కత్తెఱఁగున నిల్పుఁగాత హరికృపచేతన్॥ 189

కం. ఆదిత్యునంబ విష్ణు, గ
ణాధిపతి మహేశ్వరీని నామ్నాయవిధిన్
మాదివ్య మందిరమ్మునఁ
దాదాత్మ్యం బొసఁగఁ గొలిచెదము గురుభక్తిన్॥ 190

కం. ఎప్పుడుకృత్యము తపమని
చెప్పినసద్భక్తిఁదపము చేయఁగశక్తిన్
దప్పకయిచ్చున్ గావుత
నొప్పుగనిత్యంబుఁజేయు నోంకృతిమహిమన్॥ 191

ఆ. వె. కాంచనవసనుఁడు విరించిప్రార్థింపవ్రేపల్లియనుజరించు పట్లబుధులు
కనకయుండిరో కొ కంసారిహరిఁగాఁగ
మాంబకృపకుఁ బాత్రులాత్మవిదులు॥ 192

కం. గురువచన ప్రామాణ్యము
పురుషుఁ బరిపూర్ణ యోగిపుంగవుఁ జేయున్
నిరతవిముక్తునిఁ జేయున్
సరసమతిఁ జేయుఁ బరమసాధువుఁ జేయున్॥ 193

గీ. శ్రీరమావిభుండు పేరేచుబుద్ధులఁ
ద్రిప్పగలఁడెవండు త్రిజగములను
ఊహఁజేయఁగలమె యుచ్చరింపఁగలమె
మానఁగలమె చేయఁబూనఁగలమె॥ 194

గీ. పౌరుషమ్మునమ్మి పలువిధమ్ములఁబోవు
మనమునాఁగలేఁడు మానవుండు
దైవమునెఱనమ్మి ధన్యుఁడౌ సర్వమ్ము
సిద్ధమగుట సుప్రసిద్ధమగుట॥ 195

గీ. స్వానుభూతి గురూపదిష్టాగమార్థ
మును, యథార్థమొనర్చిన ముక్తినిజము
గాక వట్టిమాటల ముక్తిగలుగునో కొ
సంతతతపంబు సర్వార్థసాధనంబు॥ 196

గీ. చెమటపట్టెడుచేతికిఁ జెడుగుగలదె
యన్నమునుదిను సమయాన నల్లెశాంతి
పలుకుభావంబు చేష్టయుఁగలుగుపట్ల
భంగమందదు ధీరులభంగియిద్ది॥ 197

గీ. వలయునది గాక యితరంబు వలదనేని
యెన్ని విధములఁ దగియున్న నేమి ఫలము
అన్ని యుండ మంతలభియించు చున్న యెడల
బూనుకొనియున్న పని పరిపూర్తిగనుఁ॥ 198

కం. ఇతర ప్రారంభంబుల
మతిఁ జేర్పక వలయు దాని మాత్రం బెప్పుడున్
మతినుంచి దానికింపగు
గతినుండిన కృతార్థుఁడౌను గలిగియితరమున్॥ 199

గీ. పూర్వకాలానఘులు సంపూర్ణ భక్తిఁ
బడసియున్న పుడితరంబు విడిచియున్న
మాట, వారిచరిత్రలు చాటుచుండు
గృతికి నికృతీతరమ్ములఁ గృతియనఁగ॥ 200

గీ. ఆత్మమనముగలియ నానంద మొదయించు
నారసంబుగోలి యనుభవుఁడగును
ఇతర యోగములకు నెది యోగఫలముండు
యోగరాజ మాత్మయోగమండ్రు॥ 201

కం. మునుమునులు చనినమార్గం
బునవిశ్వాసంబుఁ బ్రీతి పూర్ణతఁ గనుచో
మనమది శంకలఁ బాసిన
ఘన దేవాలయము దానికన్నఁ గలదె॥ 202

కం. సంతతమన్యము నమ్ముచు
భ్రాంతిఁ గూడుచును విడుచు భంగపడుజడుం
డంతర్ముఖుఁడై ధీరుఁడు
శాంతిన్ రమియించుఁ బ్రణవజపమొనరించున్॥ 203

కం. కలఁగని మేల్కొనికలలోఁ
గలిగిన యనుభవము లెంచికలవరపడువా
రలవలె ముక్తులతోలిచ
ర్యులఁదత్త్వస్కృతాకృతిఁగని యీడుదురజ్ఞుల్॥ 204

గీ. పరస్వతంత్రతేచ్ఛఁదైనట్టి ధన్యతఁ గనఁడు
మునిని యోగవర్యను యోగములకనర్హుఁ
డగుట సచ్ఛాస్త్రతుఁ నౌట న్యాయ్యమ్ము కాని
వైకకంబదిగాన యత్నమ్ము తగదు॥ 205

కం. తిరుమల దేవస్థానము
పర వైకుంఠంబటంచు ధన్యులు తెలుపన్
నరుఁడెంతయు నెఱనమ్మి యుఁ
బరమార్థము వేఁడుకొనఁడు ప్రార్థనమునన్॥ 206

కం. అంతర్ముఖుఁడై స్వస్థుం
డెంతయు నానందమూర్తి యే శాంతుండై
నంతన్ జీవుఁడు తనువుతి
నంతన్ దగురీతి మెలఁగునందు మహాత్ముల్॥ 207

కం. రూపము నిర్లక్ష్యంబై
శ్రీపతియే లక్ష్యమనుచుఁ జెలఁగెడు దనుకన్
ఓపికను దపము నొనరుచు
పాపఁడు యుక్తుఁడు సర్వభయముక్తుండున్॥ 208

గీ. ఉచిత యోగంబునందు నైజోత్సవంబు
కాకవైరంబు లౌల్యంబుఁ గలదె జగతి
బ్రహ్మవిదునకు నోటికివచ్చినట్లు
వానిజడుఁడాడ నది వేదవాక్యమగునె॥ 209

ఆ. వె. ద్వైతబుద్ధికర్మ ధర్మంబులెంచుచు
సాధువృత్తిప్రణవ జపముసలుపు
చాత్మమయత నలరు చద్వైత సిద్ధినా
నందభుక్కగు గురునంపనుండు॥

కం. సద్యోగము భేదమునన్
విద్యన్ శ్రీహరి పదారవిందైకధ్యా
నోద్యోగము కృత్యంబగు
సద్యః శ్రేయంబుకొరకు సత్పురుషులకున్॥ 211

కం. హరిరూపము జగమనువాఁ
డురుశక్తిన్ బారఁద్రోలుచుండునుగద తా
నొరులను భేదము క్షమ చేఁ
బరిపూర్ణుఁడు వానిమ్రొక్క వలయుఁ బ్రపత్తిన్॥ 212

కం. అందఱు నావలెనున్నా
రందఱవలె నేనుంటి నదిహేతువుగా
నందఱు బ్రహ్మాకృతులుగ
నుందురని గురుఁడు తెలుపఁగ నుత్తముఁడలరున్॥ 213

గీ. స్వపర భేదంబులేక సర్వవిషయములఁ
దానిమిత్తమాత్రంబుగఁ దత్త్వబుద్ధి
నిల్చెనా! తపోబలమున నిశ్చయమది
సకలసంశయహరము ప్రశాంతికరము॥ 214

కం. ఎంచుట నందఱి మనమున
వంచించుట తమ్ము మంచివారమనుకొనన్
ముంచుకొనుచుంట గాక ది
మించుటయే ద్వంద్వసీమ మేలుంగనుటే॥ 215

కం. యశమునకో! లోకము దమ
వశమునం బొనరించుకొనెడు వాంఛనొ పాపో
పశమనమునకో! కాకీ
పశువుల కుపకారబుద్ధి ప్రభవించునొకో॥ 216

కం. అందఱువిడచుట లేదా
యందఱిలోఁ జచ్చినట్లులడఁగి మెలఁగి సత్
బృందముగొల్చుచు భగవ
న్మందిరముఁ మనముఁజేసి మనుటయె మేలౌ॥

కం. వాసనలాగునుబోసీ
మోసమ్మొనరించు సంఘముఁ గలియుకయే
యాసనశింపదుగద త
ద్వాసనఁ బాపునఁటరామదాసుల కృపయే॥ 218

కం ధర్మజ్ఞులు లేరిలలో
ధర్మము, మర్మముహరించు, దంభముఁజించుఁ
గర్మంబటు గావున నే
దుర్మతు లౌ రెంటివిడిచి దొర్లుదు రెందేఁ॥ 219

కం. జారుఁడు చోరుఁడు భీరుఁడు
కోరందగువాఁడె?లోకగురుఁడే పరుఁడే?
నారాయణుఁడే? యితఁడని
ధారుణి నరులనఁగ నరుఁడు తత్త్వముఁగనియేఁ॥ 220

కం. వనజభవుమూలకందము
వనజాక్షికి, లక్ష్మికాలవాలము హరియే
యనఘుల పట్టుం గొమ్మయు
మునులకుఁ దలపూవుమూడు ముక్తిఫలంబౌఁ॥ 221

కం. ఆకాశ శరీరుఁడగుట
నా? కలుషాత్ముల యఘంబు హరియించుటనా
లోకైక దీపముంగన
లేక భ్రమింతురనియా! లలిన్ కృష్ణుండా॥

కం. బాగోగులఁ గల్పించుచు
రాగాదులఁ బెంచి శాంతి రమహరియించున్
భోగాయతనశరీరము
లీగతి దనకొఱకు జేయు నీశుఁడు హరియే॥

కం. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ
మానసములు బుధులకెట్లు మసలిన యేనిన్
శ్రీనాథుని యారాధన
మానానాత్వంబు నందునలరు హరిక్రియన్॥

కం. వీలైన యంతవఱకే
జోలిం గల్పించుకొనఁడు సుజనుం డెందేన్
గాలమున నొకఁడుగల్గిన
లీలన్ నడిపించు గాంక్ష లేమిన్ శాంతిన్॥

కం. ఒకపాటకుఁ జేగద, నో
రికగలుగన్ రాగతాళరీతులవిడి పా
టకు నన్నిటిఁ గూర్చుచుఁ దా
నొకఁడుగ శేషించుఁబాడు నుత్సాహమునన్॥

కం. ఒకతల్లి బిడ్డలే యా
రకక్రీడకుఁ దెగలఁ బన్నరా! పెనుకయ్యా
లకు జోరరా, యూహైనన్
సకలము గలబోలెమఱచి సౌఖ్యముగనరా॥

కం. ఆగతినూరిక భగవ
ద్భాగవతుల్ క్రీడకొఱకు భ్రమపడకయ స
ద్యోగము భోగము గాంచుచు
సాగింతురు లోకయాత్ర సమరసభంగిన్॥ 228

కం. సకలాఘంబుల నార్చున్
సుకవితనుం గూర్చు సర్వశుభములఁ బేర్చున్
సకలాశితలలఁ జేర్చున్
మకుటమువలెఁ జేసి రామమంత్ర మెవరినేన్॥ 229

సీ. ఆరామమందు సంచారంబు గావింప
నానందభుక్తచే నతిశయింప
శ్రీనిమైఁదాల్చి నిశ్చింతతోఁ జనుచుండ
దేవతాళినిఁ బ్రోచు దీక్షనుండ
భాగీరథీగంగ పావనంబొనరింపఁ
బశుపాలనంబునఁ బరిఢవింప
బాహుదండంబునఁ బర్వతంబునుదాల్ప
సత్త్వపక్షిగణ ప్రశస్తినిల్ప

గీ. హరిహరాత్మక మూర్తిని నతిశయిల్లు
నాత్మఁడొక్కండె తద్జ్ఞాన మబ్బెనేని
ముక్తి యఱచేతిలోనుండు బుధులకెందు
శక్తిగురుసూక్తి సద్భక్తి శాంతిదాంతి॥ 230

కం. మనుజునిచరితంబరయఁగఁ
దననో యితరులనో గూర్చి తల్లడమే, దీ
నిని విడువగురుని హరిఁగను
మనుజత్వవిముక్తిముక్తి మనువెటులున్నన్॥ 281

తే. గీ. అప్పులనుమున్గ నూపిరియాడ కునికి
కొట్టుకొనును సదాగతికొఱకునరుఁడు
ముక్తుఁడగుటకు నవ్విధిమొఱలు వెట్ట
నభయహ స్తమిూ శ్రీహరియచటగలఁడు॥

కం. జాలియనఁ దాసహింపఁగఁ
జాలమి, తనకట్టిబాధసంభవమైనన్
వేళకు బరోపకారము
బోలున్ దనకొఱకు దానఁబోరున నేడ్వన్॥

గీ. తన్మయుండితండు తత్త్వజ్ఞుఁడితఁడని
భేదమెంచుచున్నఁ బ్రీతిసున్న
యరయరెండు గాక యలసుమహాతన్మ
యత్వమొందు సకలమందునుండు॥

గీ. అగ్నినూదుచు జలములనార్చిచేర్చి
సుత్తిపెట్టున మొత్తిరేకెత్తకుండ
దీఁగకమ్మచ్చునంబెట్టిలాగుకరణి
నిగమజాలంబులోఁ జొన్పినిగ్గుఁదీసి
బుద్ధిహరిపదభూమగా సిద్ధపరచి
స్వేచ్ఛవిహరించుశివయోగి హెచ్చుతమిని॥

కం. తెలిసిననరులూహింపఁగ
వలసినదేముండు దీనబంధువులైభూ
వలయంబునఁ గ్రీడింతురు
వెలయింతురు బ్రహ్మవిద్యవిత్తములలరన్॥

ఉంట లేకుంట యూరకయుంట చేయు
చుంట యెద్దేనిమాటాడుచుంట యెట్టు
లేని యోజించుచుంట నవ్వానందనకుఁ
దంటలేకుంట శివయోగి పంటయంట॥ 237

ఆ. వె. చూచుచుండునిద్ది తోఁచుచుండెడునద్ది
వినుచునుండు నిద్ది వినుచునద్ది
కూడుచుండునీని గూడెడునద్దానిఁ
గ్రీడయిచట యోగివాడయచట॥ 238

ఆ. పారిజాతము హరి బలిమిమైగొని తెచ్చి
యుంచుటిచట బూలునించుటచట
మాటసత్యతోడ మనమురుక్మిణితోడఁ
గ్రీడయిచట యోగివాడయచట॥ 239

ఆ. నామరూపకృతుల నానాత్వమునమన
మూఁచుచుండు నాత్మతోఁచుచుండుఁ
బోఁతచిలుకబట్టి ముక్కు జెక్కు తినుచు
పంచదార రుచినిఁబడుచునుండు॥ 240

ఆ. వె. ఎంతపూర్ణుఁజేయ నెంచుభక్తునినంత
చిన్నచూపుచూచు చున్నయంత
బ్రహ్మగురులనైనఁ బట్టితిట్టఁగలారు
భక్తిలేమి నోడలు వంచలేమి॥ 241

ఆ. వె. ఎంచిచేయఁ దగిన దించుకేనియు లేమిఁ
జింతమాని ప్రణవమంత్రమూని
తఱినిఁదగినరీతి దఱలుచు మఱలుచు
విష్ణుపాదమందు వేఁచియుండు॥ 242

కం. శ్రీరామార్చిత పదసర
సీరుహామధుపానమత్త శిష్యాళికి, నా
చారము కాంతారము సం
సారము నిస్సారమహార సహజసమాధీ॥

ఆ. వె. ఒక్కపనికిఁ గూడి పెక్కుచేతులనాఁడు
యోగమరయ నుత్తమోత్తమంబు
సర్వగతులయందు సామ్యంబుఁ గాంక్షించు
యోగమరయఁ గామనేగమంద్రుఁ॥

గీ. ఆత్మ తాదాత్మ్యమందిన యనఘమతికిఁ
బలుకు భావంబు చేష్టయుఁ బ్రబలగతినిఁ
దద్విభుత్వంబుతోఁ గూడి తప్పకునికి
మనుజుఁడా! దేహమున బ్రహ్మమయుఁడతండు॥

ఆ. వె. తనకసహ్యమయిన దానిఁదప్పింపనో
కాకతనకుఁ బ్రియముఁగలుగుటకునో
పరుల దిద్దువాని వలెనటించునుగాక
కామముక్తుఁడెవఁడు కలినిఁ గలఁడు॥

గీ. చలనమెక్కుడైన శక్తియుఁ దగ్గును
శక్తి తగ్గనేని శాంతి తగ్గు
శాంతి తగ్గినంత సమరసంబుండదు
రసము లేమిఁ బాదరసము మనము॥

గీ. మఱువకుండుట మఱచుట మరలజన్మ
మరయకుండుట శాంతిమై యొరయుచుంట
కరము మరలుట బ్రహ్మవిద్వరుఁడు వరుఁడు
నరుఁడు నారాయణుండు శంకరుఁడు గురుఁడు॥

. నిశ్చింతాత్మ తత్త్వంబది
నిశ్చయముగ దెలియనలయు నేననుకొనిన౯
బశ్చాత్తాపముకలిగి వి
పశ్చితునిఁ గోరి చేరుఁ బ్రామాణికుఁడై॥ 249

కం. జన్మాంతరవృత్తాంతము
లన్మరచుటకేమి? మాటలన్ మునువెనుకల్
కన్మాయ సంతలో మఱి
చున్మనుజుఁడు గోప్యలీనుచున్ రక్షుండై॥ 250

గీ. తెలియఁ గోరును సర్వంబు దీనఁ డెందు
వలయునర్థంబు మాత్రంబు వలచికొలుచు
ధీరుఁ డప్పట దాఁటు సంసారజలధిఁ
జర్పచేసెడు నన్యుండు శక్తిఁ గోలఁడు॥ 251
పాపపుణ్యంబులందుఁ దాఁ బ్రవృత్తు
లేల! సద్గురుపాదంబులే భజించు
వారికొక మార్గముంకు గోప్యంబుగాఁగ
వాని నెంచెడువాఁడు విజ్ఞానిగాఁడు॥ 252

గీ. పరమగురుల సూక్తి బాటించుదాఁటించు
భవమహాబ్ధి భక్తవరుల నగుల
శాంతినుండునాత్మ సద్యోగమూద్యోగ
మతనికతఁ డెసాటి యననిదివిని॥ 253

కం. తెలసితినని గర్వించినఁ
బలువిధములఁ దమముఁ బెంచు వంచకుఁడంచున్
దలఁదన్ను వలలఁబన్నున్
లలినీశ్వరుమాయతోంటి లాగునలాగున్॥ 254

మ. తలక్రొవ్వంగరగించు ద్రుంచుఁదమముల్
      దధ్యంబుబోధించు ని
స్తుల తేజస్వినిఁ జేయు సద్విబుధ హృ
      త్తోషంబుగావించు వి
ష్ణు లసన్మూర్తిని నిల్చిలోకముల క
      స్తోకాద్భుతప్రీతి ని
చ్చులునీమిత్రత సత్తపంబొకఁడె ప
      శ్చాత్తాప సంజాతమై॥ 255

కం. తినుచున్నఁ గదలుచుండును
దినకున్నపు డూరకుండు తినునది లేకే
పనిమాలి కదలుచున్నన్
గనిబాధహితోక్తిమూయఁ గడఁగున్నాయిన్॥ 256

కం. అనుభవమున యోజించును
ననుభవమే లేకయున్న నదిశాంతించున్
అనుభవ విరహితయోజన
మనమాత్మన్ మంత్రశక్తి మఱిమఱిచేరున్॥ 257

కం. ఆలోచన వ్యర్థంబై
చాలఁగఁ బురుమప్రయత్న జన్యంబైకాఁ
బోలును సర్వముసిద్ధం
బాలేయని శాంతిఁగనక యల్లాడువృథా॥ 258

కం. ఆలోచన సార్థంబై
చాలఁగఁ బరమేశ్వర ప్రసాదంబని కాఁ
బోలును దన్మయతండా
లీలన్ గ్రీడించు నెట్టులే నిశ్చింతన్॥ 259

కం. ఆలోచించెదు శక్తియ
లీలగా బరశివునిఁ గూడి లేదో కలదో
యేలా చర్చలు కంతే
కాలుఁడు కైవల్యమొసగుఁగా యత్తతినిగా॥ 260

గీ. దోషము లనుగాంచి దుఃఖింపఁగా నేల
గుణములను గణించి కులుక నేల
ఈశ్వరుండు సర్వమీశేచ్ఛకృతియంచు
గురుముఖమునఁ దెలిసికొని తరించు॥ 261

గీ. వయసు రావచ్చు చిహ్నలవలె జగానఁ
గానవచ్చును జ్ఞానంబు కలుగుకోలఁది
ముక్తలక్షణములు గురుపుత్రులందు
నురక తలపోయుమాత్రాన నుట్టిపడునె॥ 262

గీ. జ్ఞానపాదపంబుగానఁ బోషింపఁ గా
నదిచిగుర్చుఁ బూచు నదె ఫలించు
దానినైజమద్ది దానికై చింతింప
వలదు లెస్స సాఁకవలయుఁగాక॥ 263

గీ. చిత్రరీతిని భంగించి జీవతతినిఁ
దుట్టతుదకాత్మఁ జేర్చి సంతోషమందు
చుండుటే నైజ మప్పురుషోత్తమునకు
నిట్లుభంగించుటది యహంకృతినిబట్టి॥ 264

గీ. అఖిలపాపతతికి నాలవాలంబండ్రు
తత్వమెఱుఁగకునికి తథ్యమదియుఁ
దత్వబుద్ధిమెలఁగఁ దదితరంబుతోలఁగ
నాత్మమూర్తిభక్తుఁడతిశయిల్లు॥ 265

కం ఎప్పటికప్పుడు తగునట్లు
లొప్పనువిజ్ఞానిదాని కోర్వఁగఁగాదే
తప్పొప్పులు ఘటియించెడు
రవ్వాభిమాకృతులు వాని యందును దెలియన్॥ 266

కం. తన కేలాభము కల్గును
నన వేళకుఁ దనకునచ్చు దాస్యంబువినా
అనిమనము విమల మొనరిచి
కనఁడింపన యోగితాను గా గుణభక్తిన్॥ 267

గీ. పరులబోధచేయు పనికిఁబూనెడువాఁడు
అనుభవంబులేని యధముఁడంచు
రదియుగల్గుకొలఁది యంతర్ముఖుండౌను
ఆఁడుబిడ్డ దెల్పు నమ్మ వ్రాతె॥ 268

గీ. శాంతిబోధమునను శాంతిచే సత్యప్ర
వర్తనంబుదాని వలనసత్య
మెఱిఁగిసంశయంబు లెల్లఁబోఁద్రోలి ప్ర
బోధముగని నిత్య ముక్తుఁడగుట॥ 269

కం. ఆలోచనఁ జాలించిన
బాలుఁడు బ్రహ్మజ్ఞుఁ డాత్మబంధువులీలా
కేళీలోలుండన్నిటఁ
జాలినవాఁడతని గొల్వఁజాలినఁజాలున్॥ 270

కం. లేనిదికానిది లెక్కకు
రానిదిజీవత్వమద్ధ రాఁజూడకతాఁ
బూనుగురుపుత్రుఁడాత్మ
ధ్యానమె కర్మంబుతోడ నైక్యమొ ప్రీతిన్॥ 271

క౦. వాగ్వృత్తి మనశ్చలనము
స్రగ్వనితాచందనాభిరతి వివిధగతుల్
దృగ్వ్యాభవమిూఁ జాలవు
దిగ్వసనునకైన బ్రహ్మదేవునకైనన్॥ 272

క౦. తనునెంచుకొనుట నోటిలను
గనియెంచుట రెంటజగము గణియించుటగా
పునఁడాబాధ్యుఁడు జీవుఁడు
గనఁడాత్మమయతనిది కనగనునువిముక్తిన్॥ 273

క౦. గురుశైలి ననుసరింపక
నరునకు నిజపౌరుషమ్ము నఁజరింపఁగ ని
ద్ధరఁదపకు నొరులకేనియుఁ
దరణోపాయంబు గాంచఁ దరమా వరమా॥ 274

గీ. నోరుమూసికొనుచు నారాయణధ్యాన
పరుఁడవగుము నమ్మ గురునిపదము
చచ్చినట్టులున్న చైతన్యముదయించుఁ
గోరరాదువదలు కొనినవచ్చు॥ 275

క౦. ఆనందరసముఁ గ్రోలెడు
మానవునిం బొందుసర్వమంగళములు సం
తానంబుఁబోలి భక్తుల
జ్ఞానాదులొసంగి ప్రోచుఁగద యతఁడుసదా॥ 276

గీ. చేసిచూచిన వెన్క విశ్వాసమునకో
నమ్మియుండుటచేఁ బ్రమాణమ్మగుటనో
అనుభవముఁగల్గియుంట యథార్థముగనో
అక్కఅగలవాఁడర్పించు హరిపదంబు॥ 277

గీ. అడ్డొకింతలేని నడక యదియగుర్తు
పూర్ణతత్త్వజ్ఞతకు నిత్యముక్తి కదియు
నీశ్వరానుగ్రహంబుననే లభించుఁ
జచ్చినట్లుండి ధ్యానంబు సలుపుచున్న॥ 278

గీ. నిజమనీషకుఁదగు యుక్తి నెమకుకొనుట
భక్తిగురుసూక్తి క్రియలందుఁ బ్రబలనిష్ఠ
దానహరికృప విజ్ఞానధనముగల్గ
శాంతి,యందెద్ది లేకున్న, భ్రాంతిసుమ్మ॥ 279

గీ. చచ్చితిరుగుచున్న సకలలోకంబులఁ
బుణ్యుఁజేసి లెస్సఁ బ్రోచుచుండు
నిచట సౌఖ్యమీయదే రామమంత్రంబు
నెపమరయక సలుపు మెపుడుజపము॥ 280

కం. జగమంతయు హరిరూపము
భగవద్భక్తులననేల పలుతెఱఁగులనా
డఁగ విడఁగా హరియాజ్ఞ
దగునే ద్వేషంబువాసఁ దాత్పర్యంబుల్॥ 281

గీ. వైద్యశాలజగము వైద్యుఁడు శ్రీహరి
వైద్యవిద్యశక్తి పశువురోగి
శాలయందునున్న సామగ్రితో నేల
వైద్యుఁడిచ్చుదానివలన గుణము॥ 282

గీ. ఇప్పుఁడిచ్చుదాని నింకొక్కమాటీఁడు
మానునట్టిదాని మఱలనిచ్చు
రెండుకలిపి యిచ్చుచుండు నేదియునీఁడు
రోగికేల పరమయోగికేల॥ 283

క. వైద్యునందు భక్తివలయునే కాకతా
నెన్నుకొన్నఁదగునె యౌషధమందు
ఆద్యవైద్యుఁడు హరి కాత్మార్పణాను చేయు
సౌఖ్యమిచ్చుఁ బరమశాంతినిచ్చు॥ 284

ఉ. పల్లెలమాటలాడినఁ
బొల్లులు వినవచ్చు లోకమునఁ గొనియాడన్
జిల్లరజనులకుఁదగునఁట
కొల్లగ మనకిచ్చు నేడుకొండలవాఁడే॥ 285

ఉ. ఈరీతిఁ దనకు నితరుల
కీరీతిగ నునికిఁ గోరి యూహమకున సం
సారాబ్ధిమునుగు చుందువు
సారంబగునాత్మ పౌరుషము ధీరునకున్॥ 286

క. అభిమానముబిడుచుట దు
ర్లభమందురు పెద్దలద్దిరా, విడిచినచో
నుభయంబున నభయంబగు
శుభపదమలవడు నఁటన్నఁజూచెద దేలా॥ 287

తనకుమాలిన ధర్మంబు ధరణిలేదు
తానుబ్రహ్మంబయగుట తత్స్మరణమునకు
మించుకార్యంబు లేదు ప్రపంచమందు
బాహ్యమనుమాని, యాత్మభావమునుగనుము
పొందెదవు గురుబుద్ధి సంపూర్ణసిద్ధి॥ 288

విభునిఁగొల్వ సర్వవిశ్వంబు వశ్యమౌ
దానివంచు పనికిఁ బూనెనేని
వశముగా దదెట్ల ప్రజలరంజింపంగఁ
గోరుటాత్మమయుఁడవై రమింపు॥ 289

గీ. ఊఁదుచుండు మంత్రమూరక యదియెట్లొ
యోగనిద్రఁ గొలుచు నూహ చులిన్నఁ
గలువరింత వ్రాలెఁ గలవ్రాలె జన్మంబుఁ
గడచుచుండు భవముగడచుచుండు॥ 290

కం. మాకృతి కృత్యస్థి నదియున
విన్నాక కనులప్పగించి పెనఁగుటచేలా
లోకము మఱచును భక్తా
నీకమునకో హరిఁ గొల్చి నిలుతును శాంతిన్॥ 291

కం. నిజరూపము జగముఁ గని
గజిబిజిపడ నేల ముక్తి కాంక్షయుఁ గలదే
గజవరదున్ భజియింపుము
నిజమూర్తిన్ దానికంటె నేర్పెఁకఁ గలదే॥ 292

కం. తన తలిదండ్రులకు దా
జనియించిన వార్తయందు శంక జనింపన్
గనుగొన ధరలోఁ గలఁడా
మనుజుం డెవఁడేని దానిమాన్పఁగ నెటులేన్॥ 293

కం. అనుమానము పెను తెగులని
వినమా? మాయము జగమని వినమా? సృష్టిం
చునజుఁడో ప్రకృతియొ హరియో
యనఁగా వినమా యెది తెలియమిఁ గద యిటులౌ॥294

ఆ.వె. అసమానముఁ బుట్టు నపచార శతమట్టు
లాదిసంశయంబు నడపకున్న
తఱచుఁ బుట్టుచుండుఁ దధ్యంబు శంకాప
రంపర, యదిజడునిదుంపఁ ద్రెంపు॥ 295

కం. బుద్ధికలిగియో లేకయొ
పెద్దలగా నెంచుచుండుఁ బిన్నలనయయో
పెద్దలు పెద్దలు, గారను
నద్దిర! కలిఁ, బొట్టకూటికా! యశమునకా॥ 296

ఆ.వె. కవివరేణ్యులైన కాళిదాసాదుల
ప్రభనుగాన లేమిఁ బలువ్రరనుట
యేలపాటలన్ని, యెంతేనిగొప్పఁగా
నెంచువారలట్టు లెంచవలదె? 297

ఆ.వె. లోనిసార మెఱుఁగలేనిచోఁబోసినో
రేమిసేయుఁ జెఱకునెంచుఁ జేతి
కఱ్ఱకగునో గాదోకదయని యటుకవి
చరితమరయు భావ మరయలేమి॥ 298

ఆ.వె. పుట్టుచావులెన్నఁ బున్నెమాపురుషార్థ
మా! యొకించుకేని మతమెఱుఁగక
పుడమిసర్వజనులు పుట్టరా గిట్టరా
తెలియఁదగును బుధుఁడు తెలియనదియ॥ 299

కం. నిగమజాలమెంత నేర్చిన సారంబు
కొద్దియత్నమునను గొప్పపనిని
గానఁదగిన దానఁగానని యద్దానిఁ
జేసిపొందుటరయ సిద్ధమతము॥ 300

ఆ.వె. వ్యాససూత్రములను భాష్యములనుగోరి
యతనిచరితమెన్న నర్హమగునె
పాముచుట్టమంచుఁబడగవైరియనంగ
జనుల విధముగాదె జగతినీశ॥ 301

కం. నన్నయభట్టీయంబే
నన్నయ్యాది కాదటన్న నాడెవరిని నే
మన్నఁగ లోపంబా య
న్నన్నాయవార్యికెంత యానందంబో॥ 302

కం. పెద్దల దిద్దఁగ నీచుల
కద్దిరయాన్నత్యమబ్బు నను కొనియెదరా
దిద్దుటకై నను వారల
సుద్దులె యాధారమగును జువ్వెతలంపఁగ॥ 303

ఆ.వె. నేలవిడిచి సాముసేల చేయఁగనెంచు
నెవ్వఁడేని జగతి నెందునేని
తెలియమి నడయాస తెలిసినచో మోస
మూరకాడనేల యుత్తమాట॥ 304

ఆ.వె. కాకిరెట్టకొఱకు కడలిఁగలయఁ జూచి
దోసమెంచవలచు దుష్టజనుని
బోలిపూర్ణభానమును గనలేమి స
ద్గ్రంథమందుఁ గుకవిరంధ్రమెంచు॥ 305

తే.గీ. అవనివెట్టికివే విధాలెననిపిచ్చి
వాని కందంబునానందమానుగాన
బోధపఱచుటమాను చిన్ముద్రఁబూను
సహజ ధర్మానుభూతిని సజ్జనుండు॥ 306

కం. మునులేనిది తాఁగననిది
విననిది యెవరేని కోరి వినచ నిదియుతా
నననిది యనుకొననిది మా
ని నిఖిలతత్త్వవిదుఁడీతఁనికి లేనిదియే॥ ॥307॥

కం. ఎన్నిపురాణంబులలోఁ
గన్నన్ వ్యాసోక్తి యటు శుకవి తనపక్షం
బెన్నియొ ముఖముల వినుచుట
కన్నన్ హరివ్యాసుఁడౌఁ, గుకవిశుకవియె కా॥ 308

కం. జీవుల తమముం బాపఁగ
శ్రీవిష్ణువు వ్యాసుఁడయ్యెఁ జెప్పె నిగమముల్
జీవులఁదమమునఁ ద్రోయఁగ
నావిర్భవ మొందెఁ గుకవి యాభేదంబే॥ 309

కం. వినఁగలరు కొందఱవ్విధిఁ
గనఁగలరు మహాత్మచర్య కైవల్యమునన్
మనగలరుగ సమదర్శన
మునఁగొందఱు మూఢులేమి మొఱుగుదురెటు లేన్॥ 310

ఆ.వె. కొన్ని పనులకొఱకుఁ గొందఱు కూడుట
ఏవ లేక చేయు వెట్టిపనియుఁ
దమకువలయు గారణములు వెతుకుకొంట
కనిన సంఘశక్తి కలినిముక్తి॥ 311

కం. తనదుఃఖము పరదుఃఖము
గని యసహానమున విబుధుఁడు కనుసత్పథమున్
తన లేమి పరులకలిమియుఁ
గనియసహానముననకుకవిగనునాస్తికతన్॥ 312

ఆ. పౌరుషేయములగు వాక్కులభావంబు
నరసి తెలియవలయు నరుఁడు వేద
వాక్కులన్నమాత్ర భజియింపవలె భక్తి
నియమరహితులైరి నేటివారు॥ 313

కం. మానులందఱు తనపాదం
బున జీవించుటను నిత్యముం గనుగొని దా
ని నిజముగాంచం గోరిన
యనువునఁ గృష్ణుండు పదము నాసున్ గంటే॥ 314

కం. వ్యామోహము లేదాత్మా
రాముల కన వినియు నేలరా తచ్చరితల్
కామింతురు చక్రింపఁగ
భూమిన్ విహరించు వేదమూర్తులు వారల్॥ 315

గీ. ఏకదేశంబుగా విన్న దెద్ది యేని
గ్రుడ్డిగవ్వకేఁ గొఱగాదు గురుముఖమున
దద్రహాస్యంబు పరిపూర్ణతత్త్వమందుఁ
గాంచికరతలామలకంబుగా గ్రహించి
మించి ద్వాద్వంబు మోక్షంబుఁగాంచెదవల॥ 316

కం. ఆనంద రసాస్వాదము
జ్ఞానోదయ కారణంబు గాయత్రీ మం
త్రానుష్ఠానముప్రణవ
ధ్యానము మౌనంబు ముక్తిదంబులు మనకున్॥ 317

కం. తన విషయము పర విషయము
మనమునఁ జింతింపకుంట మహనీయుండై
మనుటకు మార్గం బదియొద
రనుమానంబేల నాత్మనై తగ మనుమా॥ 318

కం. బోధించిన బాధించిన
శోధించిన నీశ్వరేచ్ఛచుమి యింకేలా
క్రోధము మాధవునిత్యా
రాధన మొనరింపు జన్మరాహిత్యముగాన్॥ 319

కం. రాలేపు వెంట నెదియు
గాలంబెట్లో చేసి [illegible] చో
రాలేఁగు వెంటనెదియు
బాలిశ, నీవేల చిక్కఁ [illegible] భ్రాంతిన్॥ 320

కం. యోజన మానుషు, [illegible]
రాజసము లందునిలిచి, [illegible]ందిన ముక్తిన్
నీజీవమొ జీవత్వము
యోజీవ! హరించుదాఁక నో మ్మని యనుమా॥ 321

గీ. భక్తశేఖరులకు భగవంతుఁగొల్వకె
పరులబాగు చేయు పాడుపనికి
శక్తిధార వ్రాసి శంకరుండౌదువా
శాంతిగనుము ప్రణవమంత్రశక్తి॥ 322

కం. హృద్గ్రంధి విడగ నిరతము
సద్గోష్ఠిఁ నిలిచి యాత్మ సాత్కృతిగా శ్రీ
సద్గురుఁ డుపదేశించిన
హృద్గతమా గ్రంథరాజమిఁక నిప్పఁగదే॥ 323

గీ. ఏమియును జేయలేని నీ కేటి చింత
యంతరంగంబు నందు శ్రీకాంతునందు
భక్తి పెంపుము, పెంపుము పరమపదము
చేతమా? వట్టియల్లరి చేతతగునె॥ 324

గీ. ఊఁతపదము నోట నోంకారమున్నది
యుద్ధరింపఁజెవిని నూదెగురుఁడు
ధ్యానబలముచేత, నాత్మాభిముఖుఁడవై
నిలువుమెట్లొ భవము గెలుతుజీవ॥ 325

కం. ఏలాచింతలఁ గుందుట
మేలా? హరిలీలఁ జూచిమెచ్చక వెలిలో
నీ లీలగ జీవా! వే
యేలా యాత్మాభిముఖత నెసఁగుము హరిపై॥ 326

గీ. నిఖిల భూత వితతి నిజరూపమైయొప్పు
కేవలుండు వాసుదేవుఁడుండ
వీరివారిఁజేరి వేఁడి పీడించుచుఁ
జెడదవేల యదరి పడెదవేల॥ 327

గీ. ఉన్నదాత్మ యొక్కఁడున్నట్టులున్నది
నీవకామి, యదియు నిజముగామి
దొంగబ్రతుకు గప్పి దొరవేషమున నొప్పి
చెడెదవేల యదరి పడెదవేల॥ 328

గీ. సత్యవర్తనంబు స్వామిప్రసాదంబు
సమరసంబు, శాంతి, సాధనంబు
చచ్చినపుడు సులభ సాధ్యంబు సిద్ధంబు
ఏలగుందెదదియు నీశ్వరేచ్ఛ॥ 329

కం. జీవన్ముక్తియు సర్వము
తా విలయము చేసికొనుట తథ్యము రెండున్
దేవేచ్ఛ, చింతవృథసుమి
జీవా! హరిభక్తి లెస్స చేయుము శుభమా॥ 330

కం. ఆవంతల నచలంబులఁ
గావించి, నిరంతరంబుఁ గడపెదవేలా
జీవితము చింతమానుము
జీవా! హరిభక్తి లెస్స చేయుము శుభమా॥ 331

గీ. పలుక లేదు నోరు తెలియ లేదు మనంబు
సత్యమంచు లెన్స చాటు శ్రుతులు
ఊరకుండ లేమి నుద్యమంబులు వినో
దమున కేలనీకుఁ దాపమంత॥ 332

గీ. తోలుబొమ్మలాటలో, లంపటుండవై
జాలి యేల యింత చాలి యేల
రామవిభుని పాద రాజీవయుగమెప్డు
భక్తిఁగొల్వు మిహాము పరముగల్గు॥ 333

గీ. ఒక్కకవియె తాల్చుచుండంగ బెక్కురూ
పముల మూఢులెంత భ్రాంతిపడెద
రయ్యయో! కవిత్వమరసి పోలికలెంచి
రామరామ తెలియ రాదు నిజము॥ 334

కం. ఆత్మార్పణ మొనరించి మ
హాత్ముండై యైక్యబుద్ధి నచ్యుతుఁడగు, జీ
వాత్మకారిక్తుండగు ధ
న్యాత్మ ప్రణవార్థమరయుమా! నిశ్చింతన్॥ 335

కం. ఓజలబోధల నడువడి
నోజన్ స్మరియించి, యుత్తమోత్తమభక్తిన్
యోజనల మాని, యోంకృతి
రాజీవదళాయతాక్షు రంజింపుమెదన్॥ 336

గీ. ప్రశ్నలెన్నియైనఁ బ్రత్యుత్తరంబులు
జీవయాత్రయందు లేవెమూఢ
దైవతంత్ర మద్దితగఁ దీర్చియార్పని
దెద్దిగలుగు గురుని కృపయెకలుగ॥ 337

ఆ. వె. స్ఫోటమెప్పుడుండు నోటవాక్యములురా
నోరు సాధనంబు నుడువుటకును
గాన శబ్దమయము గద బ్రహ్మమరయంగ
కవియెపండు శ్రోత్రకల్పనలకు॥ 338

ఆ. వె. ఉన్నదానిపేల నూదిపల్కకొనఁగ
నున్నవాఁడు బ్రహ్మ మొక్కఁడరయ
చిత్రమూర్తిదాల్చు శేషాదిగిరిభుఁబోలె
జంతుతతినిబోలి జగముఁబోలి॥ 339

ఆ. వె. మాటనుండి మాట మహిఁబుట్టునందురు
మాటవెంటఁబుట్టు మాటసువ్వె
జన్యజనకభావ జాత్యంధతయుఁబోవ
గ్రమమటంచు దెలిసి కడచుబుధుఁడు॥ 340

ఆ. వె. పువ్వుకాయగాదు, పువ్వుఫలము కాయ
యాకుమొగ్గ యన్ని యాదినుండు
సమయమైనయపుడు చక్కఁదోఁచుచునుండు
నొక్కదానివెంట నొక్కఁడంటి॥ 341

ఆ. వె. వేదవిహితమైన వివిధకర్మంబుల
వేదవిధినిజేయు విత్తమునకుఁ
గలదు ముక్తిశక్తి కల్యాణమటుగాక
స్వేచ్ఛసంచరింప, హితముగాదు॥ 342

కం. ప్రామాణికములుగావున
నేమియు సంకోచమొంద కెంతయుశాంతిన్
దామై విధులు నిషేధము
లామూలాగ్రంబుఁబల్కు నవెదరు శ్రుతులే॥ 343

ఆ. వె. బయలు పడుటగాని ప్రభవించుటదిగాదు
నిత్యశబ్దమునకు సత్యమెట్లు
పుట్టుగల్గు రాక పోకలు మనకగు
రవికి గలవె పగలు రాత్రులెందు॥ 344

ఆ. వె. వీరి యొప్పులు వేసంబునకు వన్నె
తెచ్చునొక్కొ మెచ్చి యిచ్చునొక్కొ
గొప్పతనము లకుంగొంకక సాధింప
దలచుచుండ పట్టి నలపుగాదె॥ 345

ఆ. వె. అర్థమరయు పట్ల నధికారమునుగోరు
నధికృతి గలపట్ల నర్థమరయు
క్రమముమార్చి మార్చి జ్ఞానిఁ బోలెడువీని
కెంతకష్టమకట యిచట నచట॥ 346

కం. గ్రంథముఖంబున హృదయ
గ్రంథిని భేదింపరాదు గదయనిమునుని
ర్బంధించి సదాచారము
సంధించిరి మతములందు సమరసభంగిన్॥ 347

ఆ. వె. నిజముబల్క వినఁగ నిష్ఠురంబై తోఁచు
నిజముదాఁచుకొనఁగ నేర్చుకొనును
నిజమునందు నిష్ఠ నిల్పగావలె నన్న
నాచరించుచుంట యీప్తమతము॥ 348

ఆ. వె. పెండ్లియేమిటన్న పిల్లకుఁ బ్రీతిగాఁ
బల్కుఁ బల్కునగునె ప్రసవబాధ
నొప్పు డెంతవఱకుఁ జెప్పగా నొప్పునో
తప్పకంతవఱకుఁ జెప్పవలయు॥ 349

కం. ఉన్నది యున్నట్లుగఁ జెప్పఁగ
గన్నన గ్రంథంబు వ్రాయఁగలవారిపుడే
యెన్నఁగ వెలసిరి వ్రాఁతల
కన్నన్ గుణమేమి గుర్తెఱుఁగఁ జిరల్॥ 350

ఆ. వె. వారు కొంతవఱకు వచియింపఁగావచ్చు
ననుకొనంగ వీరలన్ని చెప్ప
వలెననంగ ముందు వచ్చువారేమందు
రో మహాత్ము లెఱుఁగ నుచ్చరింప 351

ఆ. వె. హింగుమిళితమైన నింపగుఁ జారది
వమనమగును బలుకు వచ్చెనేని
ఎవరి సత్త్వమెంతో యిష్టమునిష్టంబు
నంతెగాక యెంచనగునె వినుము॥ 352

ఆ. వె. మంచిమాటచెప్ప మర్యాదఁజేయుచు
మనసునొచ్చకుండ మసలుచుండి
కోర్కెలేక ప్రీతిగురువు చదువుచెప్ప
నోర్పు నేర్పుగలుగ నొప్పుకొంద్రు॥ 353

కం. విద్యార్థుల స్వాతంత్ర్యం
బుద్యమమై నేడు వెలసె నుర్విన్ భళిరే
విద్యావంతుల కిదియే
సద్యస్సాయుజ్యమగుటఁ జయ్యన సాఁగున్॥ 354

గీ. నలుసు మొదలుపెట్టి నారాయణునిదాఁకఁ
గలియఁజూడ సత్త్వకలనఁగాదె
సిద్ధిక్రియలయందు శిష్టాభిమతమైన
తత్త్వమరసి కనుము స్వత్త్వమవల॥ 355

కం. వినఁగలుగు ననఁగలుగుఁ
గనఁగలుగుఁ గాని చేయఁగలుగునె యెట్లేఁ
మనియెద ననుకొనియెడువాఁ
డని తావిజ్ఞాని వాని ననఁడే మేనిఁ॥ 356

ఆ. వె. మార్పుమార్పటంచు మనుజులు మొఱవెట్టఁ
దెలియ లేమిఁగాదు ధీరచరిత
యాచరింపలేమి నష్టభ్రష్టుండౌట
నొంటరవును జనులవెంటఁ దగులు॥ 357

ఆ. వె. బోధచేసి వారిపోకడ మాన్పించి
తనదు నేర్పుకొలఁదిఁ దన మతంబ
టంచు నొక్కదానఁ బెంచును సంఘంబు
బలము కొఱకు జయముఁ బడయఁదలఁచి॥ 358

ఆ. వె. సర్వతంత్రములను స్వాతంత్ర్యమునుగల్గు
పురుషుఁ డితఁడటంచుఁ బురముప్రొగడ
వేదవిదులఁ దర్కవాదంబులను దార్కి
కులను శబ్దశాస్త్రములను గెలుచు॥ 359

ఆ. వె. సర్వతంత్ర స్వతంత్రుండు చక్కరాఁగఁ
బూర్వపద్ధతి సూచింప ముక్కుఁబట్టి
పశువునిడ్చినచందాన బండితుండు
దేనియందేని పాండితి లేనివానిఁ
బట్టి నొక్కంగఁ బాదంబుఁ బట్టుకొనఁడె॥ 360

ఆ. వె. సత్యముఁగనుచు గృతకృత్యుఁ డౌందేని
నేమిచేసియైన నేమిచెప్పి

యైన నాత్మ తేజ మది వెల్లడించును
గాజుకుప్పె యతని కాయమౌర॥ 361

ఆ. వె. సర్వశబ్దము లవి సత్యంబు నిత్యంబు
లనెడు భాష్యవాక్య మాలకించి
కవులు కవులటంచు గాథానురాగ వి
రాగములకు గడఁగ రాదు బుధుఁడు॥ 362

ఆ. వె. కంబమందుఁ గాంచెఁ గపిలాక్షునందురు
పుట్టఁజేసెనన్న వట్టిమాట
కాంచఁగల్గు కవికిఁ గలదు శబ్దబ్రహ్మ
మెచటనేని, పుట్టుబెట్టు వేఱ? 363

ఆ. వె. కనియెనన్న దాని గ్రహియించెననికాని
కనునె తల్లి శిశువుఁగన్నయట్టు
లనఁగఁ దెలిసికొనుటయగుఁగాక యదియుద్భ
వించుటగునె తెలియరించుకైన॥ 364

ఆ. వె. సృష్టికంతకొక్క యీశ్వరుండగుటచే
స్వేష్టసిద్ధికొఱకు నెప్పుడేని
నెట్టులేని మెలఁగు నెవ్వఁడేమియెఱుంగుఁ
దపము మౌనముద్ర తారకంబు॥ 365

ఆ. వె. భేదధర్మము నెఱవేర్చుచున్నంతనె
యాజమాన్య మెట్టు లమరుఁ దనకు
ధర్మభేదమున్న దాస్యంబుతప్పునా?
అంగమెందునేని యంగియగునె? 366

ఆ. వె. బైటఁబడెడు నలలు భంగంబులయ్యును
దిరిగి జలమురూపుఁ దెచ్చుకొనుట

జలధిజారిపడుచు జలధియాచు మఱల
సలగమాఱకుండు ననవశంబె? 367

ఆ.వె. జలధిక్రీడగాక యలలకు వేఱుగాఁ
గ్రీడ సల్పనగునె? కృష్ణదేవు
క్రీడకొఱకు జగము, కృములకునన నెట్టు?
లనుచుఁ దెలిసి, ముక్తి నలచు నెవఁడు. 368

ఆ.వె. ఉన్నయట్టులుంట యుచితంబు దేహికి
నంగములకుఁ జలనమతిశయిల్ల
జలధిజలధి శౌరిశౌరి యలకు జంతు
తతికి వివిధగతులు తగులుకొంట॥ 369

ఆ.వె. అంగమన్ననంత నంగితో సమవాయి
బంధమమరు ముక్తిబాధ తొలఁగు
నిత్యుఁ డచలుఁ డంగి, నిత్యచల ప్రకృతి
జీవుఁడేడ శంక దేవులాడ? 370

సీ. తథ్యంబుగాగ, ధాతా యథాపూర్వ మ
కల్పయత్తనుక్రమతి కలుగుటెల్ల
బహుభాషలనునేర్చి పల్కుచుండెడివాఁడు
పల్కు నొక్కొకరీతి ప్రజనుగూడి
ఒకభాషనుండి వేఱొకభాషవచ్చినా
నుచితంబె సర్వపరిచితిగలుగ
సమయానుసారంబు చక్కఁబల్కునుగాక
యన్నియుండియులోననడఁగియుంట
నేసర్వరూపంబులుజలమునందుండియుఁ
బాత్రతనుగూడఁ దత్ప్రతిమగాంచు

భంగి స్వర్ణంబు భూషలౌభంగి నొక్క
యాత్మఁ బొగడ విశ్వంబు నతనిలోనఁ
బుట్టి పెరుగు నడఁగును నాబూటకంబు
మనమ! మఱువకు శ్రీవిష్ణుమఁయము జగము॥ 371

గీ. విచ్చుచు ముడుచుకొనుచుండు నిచ్చకొలఁది
మోదమందు మనుండు న మోఘవృత్తి
నాత్మనాత్మలో నాత్మచే నాత్మఁడనయ
వ్యక్తమొకటి యింకొకటి యవ్యక్తమగును
గాయకునియందు గానంబుఁ గడలియందు
ఫేనమలలు దారువునస్థి శ్వా నరుండు
నుండుగతి పెక్కు తెరఁగులనుండు నొకఁడు॥ 372

గీ. భయము భక్తియు జీవతాభవములగుట
నూరకుంటయుపో యుత్తమోత్తమంబు
సత్యమెఱిఁగినవానికి సంశయంబు
లేదు, విశ్వంబు నేమంబు లేమ భవము
సకలశేఖరుఁ డచ్యుతస్వామిభక్తి॥ 373

ఆ. ఈశతత్త్వమరసి యీశేచ్ఛ నెఱనమ్మి
దాని ధ్యానమందుఁ దగిలి తగిలి
యితరలోకమందు నేవ జనింపంగ
సహజధర్మమందు శాంతినొందు॥ 374

గీ. కలుగు నైక్యంబుగాదె యాకాశమునను
స్థానమున గుణమొక్కఁడై జరుగుకతన
నుండు లేకుండుటది భక్తియుత్తమంబు
రాధసాధ సంసిద్ధహారా! రమేశ॥ 375

కం. తనకన్నఘనుఁడు లేఁడను
కొనుఁగద ప్రతిమనుజుఁ డిలను గోటికి నొకఁడే
గనుఁగొనునె! రామతత్త్వం
బనయము స్వోత్కర్షమునకు నాశించి చెడున్॥ 376

కం. పరజనములఁ గపటంబునఁ
గర మారాధించి, భ్రాంతిఁగాలముఁ గడుపన్
నరుఁ డవ్వలఁగని యమకిం
కరులన్ దలబాదుకొనినఁ గార్యము గలదే॥ 377

కం. ఏనుండై హీనుండై
మానవులన్ సేవచేయ మఱఁగిన పిదపన్
మానమువీడిన నీచున
కౌనె? సులభశైలివిడిచి హరి భజియింపన్॥ 378

ఆ.వె. దివ్వెయున్నయపుడు దిద్దికొందుముగాక
చమురుపోయి వత్తిచల్లపడినఁ
దమము చుట్టిముట్టఁ దన్నుకొంటయెగాన
శక్తియున్నయపుడె ముక్తిఁగనుము॥ 379

ఆ.వె. ఎంత తన్నుకొనిన నేడ్చిన మాడ్చినఁ
బుట్టెఁబుట్టు బుద్ధి పోదు గాన
సహజధర్మమంచు శాంతించి యితరుల
దిక్కుఁ జూడకున్న ధీరుఁడెన్న॥ 380

ఆ.వె. ఇతరచింతమాని యీశ్వరార్పణబుద్ధిఁ
దపముఁజేయుచునికి ధన్యుని కిల
సంశయములుదీరు శాంతియు సమకూరు
నూర్ధ్వగతికిఁ బ్రణవ మూఁదుచుండు॥ 381

కం. తనవలె నితరుల నెంచుట
గన నుత్తమ మంతకన్నఁగలదుత్తమ నీ
జననము సఫలముఁ జేయఁగఁ
గనకుండుట పరులఁబరునిఁ గనుచుం స్వాత్మన్ ॥ 382

తే.గీ. పరుల యాచారమునుఁ బ్రోచుఁ బండితుండు
నీచుఁడు తన యాచారంబు నిల్పుకొనెడు
మూఢుఁడో దుష్టుఁడో రెంట మొదలు చెఱచు
జ్ఞానిపరమార్థదృష్టినిమానఁ డెందు॥ 383

తే.గీ. తాత తరమున ముత్తాతతరమునందుఁ
దండ్రితరమునఁ గనని సత్పథమున దు
నడువఁగల్గె నాపూర్వ పుణ్యంపు వశత
వానిఁబట్టంగ వశమె నివ్వసుధలోన
మధ్యవైష్ణవమునకు నామంబు మెందు॥ 384

కం. సద్యస్సృష్టిక్రమమున
హృద్యముగాఁ బ్రకృతి పరరహితపరమునితో
నుద్యోగంబున నిలుచున
నాద్యాకృతి జన్యజనక హాస్యంబేలా॥ 385

ఆ.వె. దొంతిఁగాఁగఁ జేర్చి నంతనా గిన్నెల
వేఱుఁగాఁగ దీయ వెట్టివాఁడు
తలఁచు నొకటినుండి తథ్యంబు మరియొండు
వచ్చుననిబుధునకు నచ్చునెయది?॥ 386

ఆ.వె. బూర నూదుచుండ బుస్సనఁ బామొండు
దానినుండి రాఁగఁ దథ్యమగునె

మొదటఁ గూర్చినట్లు పిదపఁజూపుచునుండుఁ
బుట్టదయ్యొ దాని పొట్టనుండి॥ 387

ఆ.వె. కవికిఁబుట్టు నేక కాలంబునందున
సర్వ పాత్రములును జర్యలట్టు
వ్రాయఁ జదువఁజూడ వచియింప నొకదాన
నొకటి పుట్టినట్టులుండు నిజమొ॥ 388

ఆ.వె. బీదవానిపెండ్లి పెద్దలసాయానఁ
జేసినంత నెవరిఁజేరుకాంత
భర్తపెండ్లికొడుకు వధువు పెండ్లముగాక
పరుఁడెవండు దానిఁ బాణిఁబట్టు॥ 389

ఆ.వె. మరణ వార్తమఱచి, మైమఱచి, హితము
మఱచి, యీశ్వరేచ్ఛ మఱచి, కఱచి
దుష్టవిద్య, పఱచి దూరదేశమునకు,
జడులు పుడమినీర్ష్యవిడువలేరు॥ 390

కం. ఉత్తమ గతికిఁ దత్త్వం
బెత్తరిలేకున్న సత్యమే లేదుసుమా
ముత్తినమణి సదృశంబగు
మెత్తని బొగ్గుపాడి రత్నమే! తలఁదాల్పన్॥ 391

ఆ.వె. రత్నరాజికి భవరత్నాకరము దూరి
పాపబాడబాగ్ని భంగమొందె
వెచ్చతగిలినంత వెనుకకేచ్చు మనంబు
కరము స్వాత్మదిక్కుగా నరుండు॥ 392

ఆ.వె. భాగవతుఁడు దుగ్ధవారాశి గ్రీడించు
గర్మ బాడబాగ్నిఁగలఁచుచోట

వెచ్చ తగిలినంత పసుకపడ్డు మనంబు
కరము స్వాత్మదిక్కుగ సహజముగ॥ 393

ఆ.వె. తనకు నరుగనివియె తల్లిభక్షించిన
బాలరూపు దాల్చి బలమొసంగు
హరి కృపావశమగు? నాధ్యాత్మిక గ్రంధ
మజునకిచ్చి సుకృతి యగుసరుండు॥ 394

ఆ.వె. నిజము చాటుచేసి నీమం డబద్ధముల్
పల్కుచుంట గొప్ప ప్రజ్ఞయంట
ఘనత కెక్కు వెనుకఁ దనదోషముల నెన్ను
కొనుట తలఁపఁ గీర్తికొఱకుఁ గాదొ॥ 395.

ఆ.వె. భారవాహకత్వ భంగి బాహ్యబలంబుఁ
దెలుపునట్లు, క్షమయె తెలుపుచుండు
మానసిక బలంబు, మాలిన్య రహితాత్మ
సంశయంబులేమి శాంతిఁదెలుపు॥ 396.

కం. వృద్ధులు జ్ఞాతులు గడచిన
సిద్ధించును ధనము తనకుఁ జిత్రము, విద్యా
వృద్ధులు తొలఁగిన విద్యయు
బుద్ధియు రాదెన్న సర్వముఁ సున్నయగుఁ॥ 397

కం. చచ్చిన దనుకన్ జదువుచు
వచ్చినదానిని సతతము వల్లించుచుఁదా
మెచ్చునకై చర్చింపఁడు
సచ్చరితుం డెందు నాత్మ శాంతినిఁగోరున్॥ 398.

ఆ.వె. గాజుకుప్పె తనువుగా, జ్యోతియాత్మగఁ
జముఱు కర్మఫలము చందమమర

వెలయఁ జేయువాఁడు జలజభవుండుగా
మనుజరూపు దివ్వె మనకుఁజూపు॥ 399

ఆ.వె. మూఁతిమలముచేత, భీతిచేఁ జేతంబు
ప్రీతిచేత నాత్మరోతఁ జెందు
నరుల నాశ్రయించి, నారాయణుఁ ద్యజించి
మోసపోకుజీవ, మోహమునను॥ 400

కం. ఉన్నంతవఱకు జీవుని
కున్నవిద్వంద్వంబు లెఱుఁగవూ ! మనమా, నీ
వన్నుగడనవి హరింపవు
వెన్నుని కృపభవముద్వంద్వవితతి హరించున్॥ 401

కం. రానిమ్ము వచ్చునట్టుల
నానాసంకల్ప వితతి నానాగతులన్
బోనిమ్ము నీమనంబును
శ్రీనారాయణునిపాద సేవకు జీవా॥ 402

కం. కానిచ్చుచుండుమిట్టులఁ
దానైనసంకల్పమడఁగు దైవాధీనం
బైనమనంబది శాంతిలు
నీనాభేదంబుమాని నిలుతు వొకఁడవే॥ 403

తే.గీ. తప్పులనుదిద్దుకొనుచుంట తప్పవేఱు
పనికిఁబూనమిఁ గాఁబోలుఁ బరమపురుష
నిలిచిపోయెను మనసు సందేహమేల
సచ్చిదానందమయము విశ్వమ్ము సుమ్ము॥ 404

గీ. బ్రదుకు తెఱువుకొఱకు భగవంతుఁ డంతయు
ననుచుఁ బరమభక్తునికిఁ దక్క..

వేఱుమార్గమెంత వెదకిన లేదన్న
భక్తి యెవరికొఱకుఁ బ్రజయొనర్చు॥ 405

గీ. తెలియ కేనియువలచి నిన్గొలిచెనేని
నీదు ప్రేరణ నటులౌట నీదుభవము
జంతు సంతానమని యందురి సాధులుహరి
వలచి నమ్మి సతము నిన్నుఁగొలువఁ గొదవె॥ 406

కం. ఊరక యితరుల వేడుచుఁ
దారకముల్ మఱచియుంటతగవా; మగవా
రేరీ, పౌరుషమునభవ
భారంబుల్, మోయఁద్రోయ, భగవానుండే॥ 407

కం. ధర్మార్థకామ మోక్షము
లర్మిలిఁదామైలభింప నందు నెవండేన్
నిర్మలమతి వలయు ననన్
దుర్మరణంబతని కెట్టి తుచ్ఛుండౌరా॥ 408

కం. కింకర్తవ్యమ్మనుచున్
శంకలఁ గుందకుము పరమ శంకరుఁడతఁడై
సంకల్పంబుల నీహృ
త్పంకజమునఁ గల్గఁజేయుఁ బాలించునొగిన్॥ 409

కం. కానన్ మౌనము మాటయు
జ్ఞానము ధ్యానంబుఁ దన్ను సంరక్షింపన్
గానివి లేనివి యాత్మన్
లీనంబగు నవల భయము లేదండ్రు బుధుల్॥ 410

గీ. హరియె జగమీ జగంబెయాహరియటంచు
హరికిమఱియొక్క తనువు లేదంచుఁదెలిసి

నిత్యముక్తులు భక్తులై నియతినుంద్రు
సాధుజనకల్పభూజ విస్తార తేజ॥ 411

కం. భగవద్భక్తులఁ గొల్వక
నిగమాధ్యయనమున నెంత నేర్పరివైనన్
సుగమంబె నీదుతత్త్వము
నగధరమమ్మాప్తజనుల నడుమనిలుపుమా।

కం నినునీవ రెంటఁ జూపఁగ
నినునీవె చూచుకొనఁగ నిజము జగంబా
నినుఁ దలఁతు వలఁతుఁ గొలుతున్
ఘనభక్తిన్ నిలుతుఁబొలుతుఁ గాంచనచేలా॥ 413

కం. నీతో నైక్యం బందక
చేతోమోదంబుకొఱకుఁ జేసెడుపనియే
పాతకము పతన హేతువు
సీతాపతి! నీసపర్యచే ముక్తుండా॥ 414

గీ. రామ! నీచేతి బొమ్మనై రమణమీఱఁ
జచ్చి చావని చందాన సాధువుండుఁ
దద్విషయకచర్చలఁ దన్నుఁ దాఁకనీక
మనము శాంతించుఁగాత నీ మహిమచేత॥ 415

కం. నీవే నినుఁ గనుటకు నా
నావస్థలఁజిత్రమూర్తి నలిగెదవనఁగా
నీవేనని గనుటకు నా
నావస్థలఁ జిత్రమూర్తి! నలుగుటయరుదా॥ 416

గీ. నీవు నీభక్తవరులు సంజీవనంబు
గాఁగ నమ్మిన మాకు జగంబుజూఁడ

రాదు, సర్వంబుమీారె కారాదెమాకు
రామమూకెందుఁ జూడమీా నామభజన॥ 417

కం. అవ్యక్త మహంకారము
సవ్యముగా వీడమోక్ష సామ్రాజ్యము, దరి
ద్ర్టవ్యము శోభితవ్యముమంఁ
తవ్యంబాతనికి నాత్మధన్యుఁడురామా॥ 418

కం. సంతోష స్వాంతుం డే
కాంతంబునఁ దపముఁజేయఁ గలవాఁడొకఁడే
శాంతుఁ డుదృజ్మాతుఁడింపై
నంత, నుదాసీనుఁ డైనయంతన్ రామా॥ 419

కం. అసిధారా వ్రతచర్యల
నసిఁజేసి యహంకృతిఁ గృతినుతి కెక్కెడుముక్
మసిఁబూసిన నేరేడిపు
డసమర్థుంగూడు, వికృతి కవలీలహరీ॥ 420

కం. జీవుఁడు ప్రాయశ్చిత్తముఁ
గావింపఁగఁ బౌరుషంబుఁగా నెన్నుదురా
జీవుఁడు, జీవతఁబాసినఁ
గేవల సద్భక్తి నతనిఁ గీర్తింతుహరీ॥ 421

కం. స్వస్థతచెడి యిటుజీవుఁ డ
వస్థలఁబడి పైకిలేచు పనిఁగనిపీఁ డు
చ్చైస్థితిలో నున్నాఁడని
యాస్థన్ గల్పించు కొందు రజ్ఞులు నృహరీ॥ 42

కం. నీయందు నితరులందున
న్యాయమె నమ్మకము శక్తి నానాగతులన్

చాయుక యందఱఁ బ్రదివ్వఁగ
గాయంతం త్రాయత యితి గాయత్రియనన॥ 423

కం. మానితి జీవభ్రాంతినిఁ
బూనితి నీపాదపద్మముల సేవయునన్
మానము కాదది, నిజమన్
దానికి సత్యంబు మౌనధారణయగుటన్॥ 424

కం. నీనామము మఱచిన నాఁ
డేనామముఁ బెట్టుచుందు విలజీవులకున్
గానన దిమౌనముద్రన్
జ్ఞానులు జపియింత్రు సర్వకాలము రామా॥ 425

కం. చాలదు నిన్నెన్నఁగ నా
నాలుక, చాలదు మనంబు, నవ్యప్రీతిన్
శ్రీలోల లోననిల్పఁగఁ
జాలదు జ్ఞానంబు, భక్తి చాలదుకృష్ణా॥ 426

ఆ.వె. జాలిబడినఁగాదు, చాలివచ్చినఁగాదు
చదువు వలనఁగాదు, శ్రద్ధకాదు
నీకుమాకురామ! నిర్హేతుకంబైన
ప్రీతిగలుగ మాకు భీతితొలఁగు॥ 427

కం. ఘనకార్యము చేసితినని
యనుకొని, పాపినియనుకొని, యత్యంతముఁ జిం
తను దగులుకొనుట, భవముం
గొనుటగదా, ముక్తుఁడునినుఁ గొలుచునెదసదా॥ 428

కం. ఏమేనిఁ జేయనెంచిన
రామా మమ్మాగుచుండురా నీ స్మరణం

జేమేనిఁ జేయుచుండిన
నీమూర్తిందాల్చు బుధుఁడు నియతాత్ముండై॥ 429

కం. స్మరణానుభవంబులఁ ద
త్పరుఁడై శాంతాత్ముఁడైన పండితనరుఁడా
కరణిఁ జరియించిన నే
మి? రమావల్లభ! యతండు మృత్యుంజయుఁడో॥ 430

కం. ఉన్నది నీవొక్కఁడవని
నిన్నివరయంగ సృష్టినిలయింతువు కా
నన్నరుఁడటు కనముక్తుం
డన్నఁ, నీవతఁడెయన్న నవి రెండొకఁడో॥ 431

కం. నీవనుచుజగములనుచుఁ
లేవెందు న్వేఱువేఱు లీలాకేళిఁ
నీవే వేవిధముల న
ట్లావిర్భావంబుఁ గాంతువందురు రామా॥ 432

కం. కూర్తువన్నిటి విడఁదీయ నేర్తువళ్ల
నాదినీదను భేద మనాదిగాఁగ
వేచుచున్నది జీవుల నీచవృత్తి
జ్ఞానమోన్నమో నారాయణాయదేహి॥ 433

కం. ఏవిధి యోచించినరా
జీవదళాక్షనిను నెపుడు చింతింపనిచో
జీవులకు శాంతియెక్కడ?
జీవనమే లేద నెడు ప్రసిద్ధియకలుగఁ॥ 43

కం. ఏవిధిని నెంచిచూచిన
దేవా! నీస్మరణ లేమి దీనుఁడౌఁగా

జీవుండెపుడది కల్గినఁ
కేవల చిన్మాత్రి రామకీర్తనపరుఁడా॥ 435

గీ. నీరుసున్నంబుఁబసుపును నేర్పుమీఱ
నొక్కతావునఁ జేర్చినఁ జక్కనైన
రాగముదయించు భంగిస్థైర్యంబుఁగలిగి
నిల్చుటేగాదె శ్రీరామ నీసపర్య! 436

కం. త్యాగము శ్రీహరి నీతో
యోగంబయ్యదియె, రాజయోగ, మవిద్యా
త్యాగం, బవధియుఁ బ్రార
బ్ధాగామ్యాదులకు భక్తియాచార్యోక్తిన్॥ 437

కం. ఎన్నన్ నీకృపకన్నన్
బెన్నిధి వేఱొండుకలదె వేదాంతోక్తుల్
కొన్నిలభించిన మాత్రనఁ
బున్నెమొ? పురుషార్థమో ప్రభూ శ్రీరామా॥ 438

కం. ఎడతెగక వెంటనంటెడు
గుడికట్టెద నందునిల్పి కొనియెదనిన్నున్
దడవేల వేంకటేశ్వర
వడివడి మద్హృదయపీఠి వర్ధిల్లుకృపన్॥ 439

కం. దేహము విడిచెడువేళన్
మోహంబునఁ దన్నుకొనును మొఱ్ఱలిడునునసం
దేహము విడుచో మాటలె!
శ్రీహరి జీవుండుచేవ చెడినీదిక్కా॥ 440

కం. ఎటులున్న నెందుడాగినఁ
దటుకున వంచించు మృత్యుతత్త్వంబదివేం

కటరమణ! తెలిసిజీవుఁడు
త్రుటిలో నినుఁ జొచ్చునాత్మ డ[illegible] హ[illegible]॥ 441

ఉ. నేర్చినవిద్య లేవి యవి నేర్చునె శాంతిని సంగ్రామముల్
తీర్చిన నార్చినన్ బరమధీరుని జేసిన ధీరుఁ జేసినన్
మార్చినమార్పు గల్గుదువు మాధవ! త్వత్స్మరణంబె, యజ్ఞానునీ
యర్చనఁ జిత్తమింక నినుహాయిగఁ జేర్చునవీన[illegible]యున్॥442

కం. ఊరక నేరము లెంచఁగ
నేరైన నన్నెర్తురుధర నేలాభంబున్
దారెఱుఁగక కృపఁగనువా
రేరీ లేరన్న బంధమేదీ? నృహరీ॥ 443

కం. దేహాత్మబుద్ధిఁబాపఁగ
శ్రీహరి! కల్పింతు వెన్నిచిత్రంబుల, దా
సోహమ్మని భజియించెద
సోహమ్మని యాత్మఁదెలియుచున్ బుధసేవన్॥ 444

కం. ఇదియదియని వదరెదరిది
ముదమో? మోక్షంబో? దంభమో? తమమో? సి
పదమో? దామోదర? పా
డెదమో కృతిఁగృతిఁగఁజేసి డెందములలరన్॥ 445

కం. మాకృతులు గతులు మతులుఁ ద్వ
దాకృతులో టెఱిఁగి యెఱిఁగి యనిశంబును వి
శ్వాకృతిఁ గాంచి భ్రమించెద
మాకృతియున్ నీదె యూరకాడింతు, హరీ॥ 446

కం. అహమను పశువుంబట్టుట
విహంగపథమునఁ జరించువిభునకు నెందే

నహిశయనా! నీకృపచే
నిహపరముల | ఖాంతియుండ దేమందునిఁకన్॥ 447

మాలిని. తెలిసి తెలిసియేలా దేవులాడంగ మేలా
కలసిమెలసియున్నన్ గాచువారెవ్వరెన్నన్
వలదువలదులోకుల్ వారిసంగంబుకాకుల్
చెలులుబుధులుమాకున్ శేషశైలేశమీకున్॥ 448

కం. మీనము, కమఠము, క్రోడము,
శ్రీనరసింహుండ, వటుఁడ, శ్రీరాముఁడయా
రా! నిజముగ సిద్ధార్థుఁడ
నేనొరుఁగన గల్కిరాజ, నినుగాక హరీ॥ 449

కం. వివిధార్థములొగి గల్పిం
తువునీకోమాకో తెలియనో పరమేశా
భవమొల్లని కవిజనముల
కవి మంగళకరములందు రాత్మార్థములున్॥ 450

కం. ఆడించితి, పలుభంగుల
నోడింపఁగ నగునె యుత్తమోత్తముఁడవు నీ
వేడాఁగినఁ గనఁగలవాఁ
డేఁడీశివయోగి? తెలియ నీ, మము రామా॥ 451

కం. లోపల నానాగతులన్
వ్యాపించెదు తమముగురుఁడు పాపగలాఁడే
రూపముననైనఁ బశ్చా
త్తాపముఁగలయట్టి భక్తతతికిన్ నృహరీ॥ 452

కం. నీయారాధన మీవై
చేయించెదుభక్తకోటి చేవీరెవరో

గాయకులా మాయికులా?
నీయవతారంబులా? వనేచరబంధూ॥ 453

కం. ద్రోహము మోహము పెంపనొ
సాహసవైరాగ్యములను సమకూర్పనొ, యో
శ్రీహరి! కష్టము పెట్టెదు
దేహుల బొమ్మలను జేసి త్రిప్పెదవీనై॥ 454

గీ. తనువుమఱపించు నీపదధ్యానమెపుడు
మానుమానసమప్పుడే మర్త్యుడగును
భవమహాబ్ధినిముగ్గు దాపత్రయాన
రామ! నిన్గొల్వనిమ్ము నిర్వ్యాజభక్తి॥ 455

కం. నీమూర్తి నాదుమూర్తియ
నీమానితశక్తి నామనీషయ నీవొ
రామా; నేనేయిక, నే
లామాటలు సిద్ధమైక్య మాత్మార్పణముల్॥ 456

కం. సుద్దులు సెప్పగ వినగా
బద్ధెములల్లంగ మోహపాశము విడునా?
యద్దిర! గురుసన్నిధిలో
దిద్దుకొనంజెల్లుగాక దీనార్తిహరా॥ 457

కం. నరుడా యింటన్! వైశ్వా
నరుడా! పంచాయతనమ! జ్ఞానమ? గురుడా
మరుడా ముచ్చటకైనను!
బురుడా! యాభరణమా! ప్రభూ! సుశరణమా॥ 458

గీ. జన్మమాదిగాగ జాతస్యమరణాగ్రధ్రు
వమ్మనంగవింటి వసుధగంటి

నాభయంబుఁబాపి యానందమీనోపి
యుందువార్తలందు నింపుమకట॥ 460

కం. కోపము, తాపము, నితరుల
లోపములు గణించుచుంట, లోలత, దీనా
లాపము, పాపనికర్మము
పాపము శమియించుఁగాక పరమేశహారీ॥ 461

కం. సత్య జ్ఞానానంద
ప్రత్యయముంగల్గి దాని ఒహురీతుల నీ
భృత్యుండై సేవించిన
మృత్యుంజయుఁ డౌను రామ యితరంబేలా॥ 462

కం. అందఱ రూపముదాల్తువొ
యందఱలో నుందొ యందఱౌదో రామా
సందియములఁ దీర్చుట నీ
కుందగు నిన్నెపుడుభక్తిఁ గొలుచుటమాకున్॥ 463

కం మృషగాదిది ఋషివాక్యము
మిషగాదు స్వధర్మమౌఁగ, మిథ్యావాచా
మషి! బూసికొనఁగ! గాదో
వృషశైలవిహారి! స్మరణకృతకృత్యతకే॥ 464

కం. తపమాత్మ స్థితికొనరువ
నెపమేలా! ఫలములేల! నిజసంసారం
బపరిమిత బాధపెట్టఁగఁ
దపియించుట సహజము భవతారకమునకున్॥ 465

కం. నీపదభక్తులు ముక్తులు
నీపద తీర్థంబుగంగ నీనుతులు శ్రుతుల్

శ్రీపతి భవసంతాపముఁ
బాపఁగ వేఱొక్క, దీనబంధువు కలఁడే॥ 466

కం. మెప్పింపలేము పరులఁ
దప్పింపఁగ లేమువిధిని దగుమాటలచే
నొప్పింపలేము నీచుల
నప్పాభక్తులనుబ్రోచు నాథ్యుఁడవీవే॥ 467

కం. నినుగొల్చి నీదుభక్తుల
ను నర్చనముఁజేసి బ్రతుకును బుధుండుసదా
తనుదాను మఱచునయ్యాది
కని, ముక్తావస్థగాఁగ గణియింత్రుసుమా। 468

గీ అన్వయ వ్యతిరేకంబులందుఁ దగు ను
దాహరణముల కైనపాత్రతలిలఁనౌ
లగుటఁ దెలసిన నీభ్యాదులడఁగుఁ గాదె
రామ! నీక్రీడయేడ మారాగమేడ॥ 469

కం. ఎప్పటి కప్పుడు తగునటు
లొప్పును, విజ్ఞాని దానికోర్వమిఁగాదే
తప్పొప్పులు ఘటియించెద
రప్పా! నీకృతుల వానియందుఁ దెలియమిన్॥ 470

కం. ఎందెందుఁ దోఁచుజీవత
యందందే దానినడఁచి యతిక్షీరత నా
నందమున గురూక్తినిఁబూ
రింధాఁగని విత్తముఁడు తరించు మురారీ॥ 471

కం. నీశక్తి నిన్నుఁగూడిన
శ్రీశాయీసృష్టిలయముఁ జెందునుబళిరే

మాశంక మమ్మువీడిన
శ్రీశా! నీపదము మాకు సిద్ధంబిపుడే॥ 452
గీ. గొప్పయత్నాన మార్పులు గోరుచుంట
నెట్టివేషానఁ బరుగులు పెట్టుచుంట
లబ్ధమైనట్టి దానియుల్లంఘనంబు
స్వాస్థ్యమెఱుఁగమిఁ దెల్పు నిశ్చయముగాఁగఁ
బుణ్యమా! పురుషార్థమా! భోగిభూష॥ 473
కం. పశువునో, శిశువునో, నై పర
వశతఁ జరియింతుననియొ, భ్రమజగమనియో
కుశలత బ్రహ్మముననియో
పశమాయనుకొనక దుఃఖవార్ధిఁ దరింపఁ॥ 4 7
కం. శిశువుఁ బశువు శివాఖ్యా న
నిశముఁ బ్రోతువునకెంచు నిఖిలమునకునీ
వుశివాఖ్యనిత్య బీజమ
వు, శివోహమ్మనెడు వాఁడవును నీవుశివా॥ 475
ఆ. వె. బ్రదుకుఁదెరవు రామభద్ర, నీధ్యానంబు
సకల జంతుతతికి సాధుగతికి
నాత్మవీవయగుట నన్నింటికెవరికి
వారికైనిమరులకారణంబ॥ 476
గీ. కార్యకారణ సంబంధ కలనఁగల్గు
ప్రీతిప్రీతియె తలఁప దుస్థితిగాక
దైవికంబైన యదిపూర్ణతఁ గనుచుండు
నిందు నందునునొకరీతి నిందుమకుట॥ 477
కం. భగవంతుఁ బరమశాంతిఁ
దగులము లన్నింటిమాని తద్భక్తులనుఁ

విగతాఘులమై కొల్చుచు
దగవా! జగముఁ గణింపఁ దాత్పర్యమునన్॥ 478

కం. గతిలేక యింటనుండుట
పతిభక్తిగఁ దోఁచునెంత పాపంబకటా
మతిమాలిన పశువులుగని
నుతియింతురు లోనమగఁడు నొచ్చుకొనంగన్॥ 479

కం. గతిమాలిన వారిగతి
చతురతను ప్రకృతినిఁజేయు చందంబున స్వా
స్థతలేమి లోనఁగుందుచు
మృతజీవులనంగ జావరేపైపూతన్॥ 480

గీ. ఇట్టివారిసంగ మెట్టిభక్తునకైన
గిట్టదన్నవారిఁ బట్టిప్రాకు
లాడనేల! రాముఁడెరామభక్తులే
యాదరిమాపరఁబు లన్నిటికిని॥ 481

గీ. దృష్టిభేదమైన నిష్టమనిష్టంబు
లరయనేల! నవియునట్లయగును
ఎవరిత్రోవవారి దీక్షరేద్భగఁదోఁచు
ముక్తిభుక్తిమాన భక్తిశక్తి॥

ఆ.వె. మాటలచేష్టలఁపుమాటిమాటికిఁబుట్టు
దేనిమఱచియుంట దీనుఁడగును
దేనిఁదెలియనన్ని తెలియునద్దానిని
దెలియవలయు మనసు నిలుపవలయు॥

కం. ఎయ్యది మఱచిన జీవుం
డుయ్యాలలో నూగునట్టు లుండును జీవుం

డయ్యున్ దేనిని నమ్మినఁ
జయ్యన శాంతించునట్టి జపమొనరింతుర్॥ 484

కం॥ ఎడ తెగక తపముజీవుఁడు
సిద్ధుఁ జేయఁగఁ దాళ లేమిగడగడవణఁకుర్
జడమగు మనమది జడమగుఁ
బడవుండక బ్రహ్మమందుఁ దద్దయుఁగలియుర్॥ 485

కం. నాస్తికుఁడు వివిధదృశ్యో
పాస్తిన్ దామఱఁగి మఱచ భగవద్భక్తో
పాస్తిన్ బ్రహ్మోహమ్మని
స్వస్తికిఁదనుఁ దావిడి చెడుసాధువుకలఁడే॥ 486

కం. ధరణి వధూవరులనువిడి
బిరబిర సర్వంబుకూర్చి పెండిలిఁజేయర్
నరుఁ డొనరించెడు యత్నము
సరసులువిని మెచ్చుకొండ్రిడి సఫలంబగునే॥ 487

కం. మమతా హంకారంబులఁ
గ్రమమున విడలేఁడురామ కైవల్యంబుర్
సమతన్ జీవామృతమని
సుమతిన్ గనలేఁడు తగులుచో దృశ్యములన్॥ 488

కం. తోఁచిన సర్వముదృశ్యము
తోఁచును దృక్కునకు దుఃఖతోయధిముంచుర్
చూచెడు పనిలలిమాని! ప్రతి
లోచనుఁడై మించునాత్మలో రమియించుర్॥ 489

గీ. కానినీశ్వరేచ్ఛ కై వేచియుండితా
మౌనముద్ర రామ! మంత్రజపము

చేయుచున్నదిద్ది సిద్ధించుసర్వదా
బుధులమాఁ ఋద్ధి బోధమిద్ది॥ 490

గీ. బయటబాగుచేసి బ్రహ్మంబుఁగాంచెద
ననుటయనుకొనుటయునరయఁగల్ల
ఆత్మలోననుండ నానందమన్యుల
వలనఁగలుగుటెట్టులవలనుపడును॥ 491

గీ. సకలలోకంబు నిన్మెచ్చిసంతసింప
సకలలోకంబు నిన్మెచ్చిసంతసిలదు
సకలచూడావతంసుండు సంతసిలెడు
సకలచూడావతంసుండు సంతసిలఁడు॥ 492

కం. రామాన్వేషణతత్పరుఁ
డేమియుఁ గోరండు ముక్తినే నటులాత్మా
రాముండై సాక్షాత్ర్ఛీ
రాముండగు శంకలేదురా గురుమూర్తీ॥ 493

కం. ఆలోచనలన్ మానిన
బాలోన్మత్తులనుబోలి పలుగతుల నిలన్
లీలాకేళీలోలుం
డైలాలింపంబడు హరిహరనాథుని చేన్॥ 494

కం. లీలకునగు కేళులలో
బాలుఁడు తగులందువట్టి పరుగులుమాటల్
చాలఁగ నొనరించుచు నే
జోలింగల్పించుకొనక శుభములఁ బడయున్॥ 495

గీ. కానఁ జిన్మాత్రుఁడైయున్నఁ గలదుముక్తి
చిత్తుతనయంతతాన నిశ్చింతసత్తు

నందుసహజంబుగఁ గలియు నందు రెందు
దాననానందముదయించుఁ దథ్యమిదియ॥ 496

ఆ.వె. గూనివానిపాట్లు గూనివానికెఱుక
మూఁగవానిపాట్లు మూఁకకెఱుక
ఎవనిపాట్లు వానికెఱుకయేకాక య
న్యులకుఁ దెలియనశమె యొకరిగోడవ॥ 497

కం. పండిత పామరజనులకొ
కండుగ గతిఁజూపినేటి కలినారా బ్ర
హ్మాండం బంతయునీవని
దండిగఁ దెల్పితివిభూరి దయ శ్రీరామా॥ 498

కం. తనకుందెలిసిన విషయమె
తనకితరులు తెల్పవచ్చుఁ దథ్యముధరలోఁ
దనకుందెలియని విషయము
వినఁబడదెన్నాళ్ళువిన్న వింతగ నృహరీ॥ 499

కం పాపము పుణ్యము తనలో
నేపూర్ణతఁ గాంచుచున్న నితరులలోనఁ
బాపము పుణ్యా గనుగొని
పాపనివలె నెంచునేమి పాపమునృహరీ॥ 500

కం. జ్ఞానాజ్ఞానము నందునఁ
గానంబడు విశ్వమాత్మ గద భయమేలా
జ్ఞానాజ్ఞానములందునఁ
గానంబడు పాముత్రాడు గద భయమేలా॥ 501

గీ. బుద్ధిలేనిజీవు బోధింపఁ దగుఁగాక
చిక్కుపెట్టఁదగునె పెక్కుగతుల

నతులభక్తివిభునుఁ డాత్మార్పణము చేసి
మాయదాటుకేఁ జుమార్గమేది॥ 502

కం. లీలామానుషవిగ్రహ
కాలంబుద నీలదేహ కంసారిహరీ
కాళీయఫణి ఫణాగ్రవి
లోలాంఘ్రి ద్వయసుభక్త లోకాధారా। 503

కం. గురురూపంబున సర్వము
కరుణాకర తెలియఁజేసి కాలుష్యంబుల్
విరమింపఁ జేయవే-లోకో
నరునిన్ రక్షింపఁబట్టు నారాయణుఁడై॥ 504

కం. నిన్నుఁదురీయమునందుఁ బ్ర
పన్నత గురుభక్తి సర్వ వాసన లెడలన్
గన్నంత దాఁకనీవై
యున్నంతటిదాఁక ధ్యానమ:దుము నృహరీ॥ 505

కం సాక్షిగనుండందరమొ, యు
పేక్షింపదరమొ పరుల వేవిధములుగా
నాక్షేపింపఁగవరమో
కుక్షిన్నింపెడు నపేక్షగొల్పుటపరమో॥ 506

కం. మోక్షాపేక్షగనఁగయమ
శిక్షాభయమంతెకాక, శివదీక్షయ? మా
కక్షారక్షకు నీదుక
టాక్షము సాక్షాత్ప్రబోధ మబ్బుటక? హరీ॥ 507

కం. శిక్షించిబోధఁజేయ ను
పేక్షింతువు నీచవృత్తిఁ భీతిజనింపన్

రక్షించి మోక్షమీయఁగ గ
టాక్షింతువు జీవతతిని హరిహరనాథా॥ 508

కం. పక్షీంద్రదయాన నృహరీ
యక్షీణ కృపాకటాక్ష యాశ్రితరక్షా
వీక్షింపుము కృపనస్మ
చ్ఛిక్షాంరాజీవ మిత్ర సాధుచరిత్రా॥ 509

కం. అక్షరమధువైరిజగ
ద్రక్షాతత్పర పరోక్ష రాజీవాక్షా
రాక్షస శిక్షా కేళీ
దక్షా శివభక్తి దీక్ష ధర్మాధ్యక్షా॥ 510

మ. పరమార్థంబది జీవకోటికొసఁగన్ వాగ్దేవియై శ్రీతియై
హరియై శంకరుఁడై, గణేశ్వరుఁడునై యాదిత్యుఁడై యంబయై
పరుఁడై దేశికుఁడై, పరాత్పరుఁడునై ప్రత్యేకరూపంబులన్
ధరియింపంగల నీదుశక్తిఁ దలతున్ ధర్మార్థకామంబులన్
బరివర్జించిన భక్తపాళికిఁ గదా ప్రాప్తించు దద్యోగమో
కరుణాసాగర రామచంద్ర నృపతీకైవల్యదాత్రాకృతీ॥511

మ. వరముల్ వేడను వాంఛలేక మదిలో వైరాగ్యముంబూని స
త్వరమే నాత్మగతుండవైన నినుగొల్వంగల్గినాభాగ్య మే
ధరనీ గ్యంబనియెంతు నీపదములన్ ధ్యానింతు మోదింతు
నా
పరమార్థంబిక వేఱుగోరుదు నె తాత్పర్యాబ్ధి యోగంబునన్
గరుణాసాగర॥ 512

మ. హరియే యీజగమిద్ది యేహరియటంచాత్మావ
లోకంబునన్
హరిపూజావిధినున్న భక్తులకు బ్రహ్మానంద సంధాయకుం

దురుదీక్షాపరుఁడార్తరక్షణమునన్ యోగీశ్వరేశుండవో
కరుణాసాగర॥

మ. చరియించున్ గలకాలమెట్టిఁకో మనశ్చాంచల్య సంతృప్తికై
భరియించున్ భవభారమెట్టులో దౌర్భాగ్యంబు చేఁజిక్కఁగా
హరియించున్ గలజ్ఞానలేశమది యీయాభ్రాంతినిన్ బోవుచో
కరుణాసాగర॥ 513

మ. పారినానాత్వము నీదునైజమయి పెంపుంగాంచుచో జీవులన్
స్థిరభానంబును దాల్పకున్న భవవార్ధిన్ ముంచి బాధించి ము
క్తిరమాదూరులఁ జేయనెంచెదవు సందేహంబులన్ బెంచెదో
కరుణాసాగర॥

మ. నరనారాయణ రూపమొంది ప్రజలన్ నానా వినోదంబులన్
గురుశక్తిండగ రక్షణంబొసఁగు నీగోప్తృత్వ మేపాటిదో
పురుషార్థంబు నెఱుంగనట్టి పశులన్ బ్రోవంగనేఁగాఁతులే
కరుణాసాగర॥ 515

మ. పరికింపంగుణమేమి యుండమగదా భక్తక్రియల్ లేనిచో
ధరమానంబునధర్మతత్త్వమరయన్ దార్ఢ్యంబు గల్గున్ మహో
ద్ధారమై యొప్పెడునాత్మ యజ్ఞమున కధ్వర్యుండవీవేకదా
కరుణాసాగర॥

మ. జరయుఁ మృత్యువు నెంబడింపఁగ మదిఁ శంకాలవం
బున్ గటా
చారనీ డెంతయు మెచ్చునీభవముఁ జూచున్నాకమట్లీభువిన్
గరమర్థించుచు స్వప్రయోజకత సౌఖ్యంబంచు మోదిం
చుఁ గా
నరుఁ డెందుఁ దన ఘు జతఁ గణనకుఁ రానీఁడు నీమాయ చే
కరుణాసాగర॥ 517

మ. గురుమూర్తిఁ లలిఁ గొల్వ లేదు మదిసంకోచంబులఁ
వీడఁగా
నురు యత్నంబున విద్య నేర్వగను నేనోపఁ స్వధర్మంబు నే
నరయఁ నన్ను భరించు టెంచఁ గృపగాదా దీనచింతామణీ
కరుణాసాగర॥ 518

మ. స్థిరకల్యాణమునందొఁబంగి ధరనీ సేవార్థి గాకున్న చో
వరముల్ చాలఁగనీయదక్షుఁడవు దుర్వ్యామోహాముం
బెంచి సం
సరణంబుఁ మెడగట్టి బుద్ధిమఱలఁ సాయుజ్యమీ నేరదా
కరుణాసాగర॥

మ. ఒరులఁ నమ్మొట యాధి హేతువని యార్యుల్
వల్కునాలించి బ్ర
హ్మారసౌఖ్యముకల్గునంచ నెదునాత్మారాములంగాంచి నీ
చరిత గాలము పుచ్చు దుఁ డెదరు విశ్వాసంబు లేకుంటమా
నరుఁ నార్మార్గ్యము వారిఁ బ్రోవఁదగదా! నారా
యణా దీనులఁ
కరుణాసాగర॥

మ. పరముఁ బావనజీవనంబు సుమముల్ ప్రజ్ఞానముఁ
భక్తియుఁ

సురసాలంబును, గల్పవల్లియునగుꣳ, యోగంబు నీరం బెయా
నరయꣳ బీజము సుమ్మమాపతి యతండాచార్యుఁడే కావునం
బరణంబందులభించు సత్ఫలము సాయుజ్యమꣳ దానికం
దురు సర్వంబును నీప్రభావముగ నెంతుꣳ వేగటాక్షింపవే!
కరుణాసాగర కామితార్థవరదా! కైవల్యసంపత్ప్రదా! 521
మ. శరణంటిꣳ దమచిత్తమంటిఁగృతికిꣳ జాలꣳహాయంటినీ
చరణంబేగతియంటి రిక్తనిక నాసర్వస్వ మానంటినꣳ
బరిశోధింపకుమంటి, మంటిని సదానందంబునన్నిక్కృపన్
గరుణాసాగర కామితార్థ వరదా కైవల్యసంపత్ప్రదా॥
చ హరనుత కేశవా! భవమహార్ణవతారక తారకారి శం
కర గురుసార్వభౌమ కలికల్మషనాశ, సురేశవంద్య వ
ద్వరద గిరీశశ్రీధర వితర్కవిదూర సమస్తనాథ బం
ధురతర కాననాంతరవినోద ధరాంచిత పుత్రికావనా॥
సీ. అన్నిరూపంబులను దాల్చియెన్నికొన్న
నెందు నేలంకెలేక యానందమున్న
నందనందను వేఱ యెన్నంగ లేమిఁ
గాదెయవతారముల యందుగణన లేదు॥ 524
సీ ఉండిలేనట్టు బ్రహ్మంబ యుండునొక్కఁడె
లేకయున్నట్లుతోఁచు నీలిలజగము
కనఁగ రెండుగనుండి యొక్కంటెయాటఁ
దవదు తత్త్వంబుఁ గాఁదెల్పి ధన్యతముల
భక్తవరులను జేయంగఁ బ్రబలినాఁడు
కృష్ణవేషంబుఁ దాల్చి శ్రీకృష్ణమూర్తి॥ 525

ఉ నీకమనీయవిగ్రహము నీ కరుణార్ద్ర విలోకనంబు న
స్తోక విభూతి గోపికల తోడుత నాదిమ దంపతీ రసో
ద్రేకము జీవులాత్మగను రీతులు నీతులుబోధ చేయులో
కైక సుపోషణా! పరమనాస్తిక శోషణ నందతోషణా॥ 526

కం. మధురాపురీ విహారీ
మధుకైటభహారిశౌరి మాధవనృహారీ
మధు మధుర వచశ్శ్రీహరి
సుధాకర కలాపభూరి శోభాలహరీ॥ 527

కం. గోపకుల మందు నందుని
పాపఁడవై పుట్టుటేమి పాపము పోనీ
గోపికలన్ గామించుట
శ్రీపతి!తగునట్టు! పిల్లచేష్టలు నీకున్॥ 528

కం. వెన్నుఁడవని మునులందఱుఁ
బన్నుగ సద్భక్తినిన్ను భజియింపంగా
వెన్నందొంగిలు టేలొకో!
మున్నా క్షీరాబ్ధి నున్న మురహారినీకున్॥ 529

కం. ఏవిధి నున్నను శ్రీహరి
నీవని పరమార్థ దృష్టినెంచు బుధులకున్
దైవల్యా మొసఁగి వారల
చే విజ్ఞానంబుగలుగఁ జేయఁగ బ్రజకే॥ 530

గీ. సకలకల్యాణ గుణములజరుగుదీవ
దుర్గుణంబులు వేటెందొ దూరునంచు
దలఁచు కించిజ్ఞులకుఁ బూర్ణతత్త్వదర్శ

నంబూసంగఁగఁగృష్ణ వేషంబుఁదాల్తు
విశ్వరూపుఁ డీవంటివినియు వినము
కనిన మాత్రాన నేమయ్యె నట్లెనంచ
రాజసభను గౌరవుల్ ధృతరాష్ట్రినకును
స్వాత్మ మహిమంబు నీవు చూపకమె యున్న
నియమరహితంబు బ్రహ్మంబు నీసుమూర్తి॥ 531

కం. జ్ఞానవ్యాఖ్యయకరణము
జ్ఞానానందమయుఁడు శివునకుఁ బర్యాయంబుల్
దానోరులకుఁ దెల్పుటకన
నేనంతటిదాననీనారకేకీర్తింగుల్॥ 532

గీ. మాధవా సురేశ మధుసూదనా హరీ
దేవదేవా వరద దేవేశ శేశ
పంచవిషయములఁ బ్రపంచంబునన్గాంచి
యాత్మనిను గాంతు నభవకృష్ణ॥ 530

కం. నందానంద వివర్ధను
నిందీవరవర్ణు నిందిరేశునసీశున్
గందర్పజనకునిన్ గో
విందుని భక్తిఁగొలుతు బ్రైతబృందారకునిన్॥ 534

గీ కృష్ణనిన్నుఁబోలఁ గృష్ణచేలంబన్న
యతనిఁబోలఁగఁ గనకాంబరంబు
నీవుఁదాల్చుచుండ జీవులకెవ్వాఁడు
పొందఁదగినవాఁడో బోధపడునె॥ 535

గీ. శివునినాశ్రయించు శివయందురంతెగా
సృష్టివిషయమునను శివస్వతంత్రి

యెవరిఁగొలువవలెనో యెఱుఁగునా? జీవుండు
ఇద్దఱొకటి యందురిదియఁ గొంత॥

కం. ఒకరాత్రిఁ జన్మించితి
మి కదా నాయందుఁ గరుణ మేలొనఁ గూర్పన్
వికచాబ్జనయన! తగునెపు
డకలంక స్థితిని నిల్పుమా నను గురుల॥ 537

కం. శివదం శాంతిద ముత్తమ
మవధీరిత శత్రులోక మానందదమా
త్మవిదాం శరణం యదుపుం
గవతవచరణం భజామి కనకాభరణం॥ 538

కం. అంధః సంసారాంధా
బాంధవహిత మోహబద్ధ పాహీతుకృపా
సింధుమ్ విస్మృత్యసకల
బంధుమ్ కృష్ణ పతతి పాహితతోమామ్''

కం మమతాహంకృతి రహితా!
విమలానంద కలితాశ్చ విజ్ఞానయుతాః
కమలేశ మివకృపాబ్ధిమ్
సమరసభరితా విశంతి సరితస్సరళా॥ 540

కం. శరణాగత రక్షణత
త్పరపురుషోత్తమ రమాధవకృపాంబోధే
[illegible]రూప విశ్వేశసకల
శరణం భవహరణమేష చరణం తవ మే॥ 541

శా. [illegible] లసద్యోగ ప్రభావాద్భుతా
ల[illegible] రామచంద్రపద కల్యాపాన లోలాత్మస

ప్రైంకర్యాహుతవాసనా కుసుమశంకాకాసనోద్భూతమో
దాంకాగ్రేసరచక్రవర్తిపరిచర్యాభక్తియేను కిరాహా॥542

కం. ఎదిసర్వ వేదసారం
బెదియీశ్వర తత్త్వవిషయ హేతువయినదె
య్యాదిభూషణ భూషణ మా
సదమల నాగేశుపదము సతతముగొలుతున్॥ 543

కం. వేంకటరత్నాకరమును
బంకజముఖలక్ష్మికునిక్కపట్టునుగొండి
న్యాంకమునగు వంశాబ్ధిశ
శాంకుడు నాగాభరణము శరణముగాంగన్॥ 544

మ. అమృతానందునినాశ్రితావనునినవ్యార్యాభిధానున్ గురున్
సుమనఃకోవిదు,సూరిలోకవినుతున్, సంస్తోకుంగీర్తిం త్రుసద్
ద్విమాలాచారుని,శబ్దశాస్త్రిచతురున్ విజ్ఞానసంశత్రుపదున్
సమునిన్ స్వాత్మసుఖైకవేదిననఘున్ సత్యార్థసంధాయుకున్

మాలిని. విదిత సకలసారం వేదవేదాంత వేద్యం
మదనజనక మాద్యం మామకం చేతకేంద్రం
సదయహృదయమిత్రం సాధుసంతాన చైత్రం
ముదితవదన మీశం పుష్పవన్నేత్రమీడే॥

ఇది శ్రీమదమృతానంద నాథ గురునాథ బోధ సుధాబ్ధి కల్యాణ పదాబ్జ
సేవాలబ్ధ మనీషా జనితోభయభాషా కవితా భూషాలంకృత విద్వ
త్కవి తిలకాయమాన కనకావిఖ్యాతామృతసారాఖ్య
మహాకావ్యంబునందు సర్వంబు నేకాశ్వాసము

సంపూర్ణము.

·

# తప్పొప్పుల పట్టిక



| పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 2 | కొలచి | కొలిచి |
| 24 | 2 | నెల్లెట్లో | నెల్లెట్లొ |
| 27 | 3 | బెదరుచు | [illegible] |
| 42 | 4 | సుమ్ము | సొమ్ము |
| 49 | 2 | స్వక్రమం | నక్రమం |
| 55 | 4 | నందడు | నందండు |
| 66 | 2 | వాతనికే | నాతనికే |
| 83 | 2 | మూరి | మూర్తి |
| 138 | 4 | యత్నమిటు | యత్నమిట్లు |
| 186 | 2 | భుక్తిముకి | భుక్తిముక్తి |
| 189 | 2 | జితవృత్తి | జిత్తవృత్తి |
| 199 | 4 | గ్రనుక | గనును |
| 205 | 2 | యోగవర్య | యోగవర్య |
| 230 | 4 | సూక్తి-కాంతి | సూక్తిసద్భక్తి కాంతి |
| 267 | 2 | నవవేళక | దగవేళకు |
| 293 | 1 | లకుల | లకిల |
| 304 | 3 | నడయూస | నడియూస |
| 310 | 4 | మూఢులేమి | మూడులేమి |
| 316 | 2 | గవ్వాకె | గవ్వాకే |
| 321 | 3 | జీవత్వము | జీవత్వమొ |

| | | | |
|---|---|---|---|
| 361 | 1 | డిండేని | డిండేనియు |
| 371 | 5 | చేసర్వరూ | సర్వరూ |
| 465 | 1 | స్తితికొనరువ | స్థితికొనరుప |
| 480 | 2 | న ప్రకృతి | నుపకృతి |
| 483 | 1 | మాటలచే | మాటచే |
| 486 | 2 | మఱిచ | మఱువ |
| 504 | 4 | రక్షింపఁబట్టు | రక్షింపఁబాట్టు |
| 521 | 4 | సాయుజ్యముఁ | సాయుజ్యముఁ |
| 525 | 4 | శ్రీకృష్ణ | శ్రీవిష్ణుమూర్తి |
| 528 | 2 | పాపడవె | పాపఁడవై |
| 539 | 4 | బంధుం కృష్ణ | బంధుంత్వాంకృష్ణ |
| 545 | 4 | సత్వార్థ | సర్వార్థ |

శ్రీరామ

---

.

శ్రీ తిరుమలశ్రీనివాసత్రిలింగ మహావిద్యాపీఠము,

# విద్యాశాఖ.

---

# కవితిలకగ్రంథమాల,

3/71 లాయిడ్సురోడ్డు, కెథడ్రిల్ పోస్టు, మద్రాసు.

---

శ్రీమతి కవితిలక కవితావిశారద విద్వాన్
కాంచనపల్లి కనకమ్మగారు రచియించిన

## —♦ పద్యగ్రంథములు ♦—

1. శ్రీ జీవయాత్ర -- ఇది వేదాంతప్రతిపాదక మగు పద్యకావ్యము రు. 2—8—0

2. హంసవిజయము -- ఇది మనోహరమగు వేదాంత నాటకము రు. 1—8—0

3. అమృతసారము - (పద్యకావ్యము) శ్రవణపేయ మగు తత్వబోధ మిందుఁ గలదు రు. 1—0—0

4. ఆనందసారము — జిజ్ఞాసువుల కవితరలభ్యమగు తత్త్వరహస్యములిందుఁగలవు(పద్యకావ్యము) రు. 1—0—0

5. పద్యముక్తావళి — ఇది జీవయాత్రాంతర్గత పద్య సముదాయము రు. 0—8—0

6. శ్రీమద్రామాయణకథాసంగ్రహము - ఇది వాల్మీకీయ బాలరామాయణమునకుఁ గందపద్యములతో నైన యాంధ్రానువాదము (సటీకము) రు. 0—6—0

7. ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము - ఇది మూలము ననుసరించియు లలితమగు శైలిని వ్రాయబడిన నాటకము. కొన్ని తావులలో మూలమునకు వన్నె పెట్టబడినది రు. 1—0—0

8. రంగశతకము - ఇది కవయిత్రితన పదియు రెండవయేట నెల్లూరి రంగనాయకులపైఁ జెప్పిన కందశతకము 0-4-0

—♦ వచన గ్రంథములు ♦—

1. రాధ ఇది యొక సాంఘిక నవల. ఉన్నత పాఠశాలలలోఁ బాఠ్యగ్రంథముగఁ జిరకాలముగ నుపయోగ పడు చున్నది. రు. 0—15—0

2. గౌతమబుద్ధ చరిత్రము-ఇది బౌద్ధమతప్రవక్తయగు బుద్ధదేవుని చరిత్రము. బాలికలకు, బాలకులకుఁ బఠించుటకు యోగ్యము. రు. 0—10—0

కవితిలక కనకాంబగారి వచన గ్రంథములు గాని, పద్య గ్రంథములు గాని దాదాపన్నియును మద్రాసు యూనివర్సిటి వారుకొన్ని యున్నత పాఠశాలలకు, కొన్ని ఇంటరుమీడియేటు

ను, బిస్యోతుఁ బాఠ్యగ్రంథములుగా నేఁటట నిర్ణయించు చున్నారు.

—♦ కవితిలకగారి గ్రంథములు అచ్చులో నున్నవి ♦—

1. బోధకథాసుధ — (వచనము) తత్త్వబోధమున కుపయోగించు చిన్నకతలు. ఈ కతలు వ్యవహారమునను మాబర్థరమునను సమయోచితముగాఁ బ్రయోగించిన శ్రోతల కపరిమితానందము కలుగును.

2. తోమాలియ—ఇది కవయిత్రియాసందర్భము లలోఁ జెప్పిన పద్యకుసుమము ల సముదాయము. ప్రస్తావోచితము. మనోహరము. సమకాలికులగు మహాకవుల యభిప్రాయ బోధకములగు పద్యరత్నములునుం గలవు.

—♦ ఇతరుల గ్రంథములు ఆచ్చుయి సిద్ధముగా నున్నవి ♦—

వైద్యరాజ డాక్టర్ దంలు సుబ్బావధాని కృతములు.

1. దాసగీత—ఆత్మానుభూతిని, గురుభక్తిని రసోద్రేకముగ జెల్పునట్టి పద్యకావ్యము. ఈరీతికావ్యములలో నిదియె మొదటిది.

2. అంబికాచరణ సరోజపూజ— ఇందలి భక్తి పార వశ్యము, ధారాశుద్ధి యుపాసకులకు హర్షదాయకములు,

3. ఆంధ్రభామినీ విలాసమ -
డితరాయల భామినీ విలాసమున
వాద మింతకు మున్నెవ్వరును రచిం

4. చిత్రమాధవనాటకము-ఇ
కవి కామెడి ఆఫ్ ఎరర్సు అను నాంగ్లన ...

5. ఆంధ్రవైద్యవిజ్ఞానము - ఇది ప్రాచీనార్వాచీనసంప్ర
దాయములను బోధించు గద్యపద్యాత్మకమగు వైద్యగ్రంథము

6. అమృతానందనాథస్వామిచరిత్రము. సాధకులకు
సిద్ధులకు అపరిమితానంద సంధాయకమగు వచనగ్రంథము.

ధర్మవాది దంటు శ్రీనివాసశర్మ, బి. ఎ., బి. ఎల్, గారిచే
—• వ్రాయబడిన గ్రంథములు •—

1. నాగభూషణ శతకము-ఇది శ్రీతిరుమల శ్రీనివాస
త్రిలింగ మహావిద్యాపీఠస్థాపనాచార్యులగు శ్రీమాన్ అమృతా
నందనాథస్వామివారి, వ్యావహారిక నామమున కంకితముచేసి
చెప్పిన భక్తిశతకము. గురువుల కంకితముచేసిన శతకమగుటచే
సాధువులకు సంతోషకారిగా నుండును.

2. శ్రీతులసీదాస చరిత్రము-ఇది మహాభక్తుఁడు, మహా
కవియు నగు తులసీదాసుని చరిత్రము. పద్యకావ్యము. ఆధునిక
రచనయయ్యు రసభావభరితమై, యార్యవిజ్ఞాన సంప్రదాయ
బోధకమగు లలిత పద్యకావ్యము ముముక్షుజనాశ్రయము